Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 5 • 1-2-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## దొమ్మీ తరహాలో షర్మిల పాదయాత్ర!



మోకాలి గాయం వల్ల రెండు నెలలుగా విశ్రాంతి తీసుకొంటున్న వైఎస్ జగన్ సోదరి షర్మిల తన పాద యాత్రను తిరిగి ప్రారంభించడానికి సిద్ధపడుతున్నారు. అయితే ఆమె యాత్ర నిలిచే నాటికి ఇప్పటికి తెలంగాణలో చాలా రాజకీయ మార్పులు వచ్చాయి. కేంద్ర హోంమంత్రి షిండే జరిపిన అఖిల పక్ష సమావేశం అన్ని రాజకీయ పార్టీల అభిప్రాయాలను వెల్లడి చేసింది. వైఎస్ఆర్ కాంగ్రెస్ అటు ఇటూ కాకుండా తటస్థంగా వ్యవహరించినా వారు తెలంగాణకు అనుకూలురు కారన్న భావన ఏర్పడి పోయింది. ఈదశలో రంగారెడ్డి, నల్గొండ జిల్లాలలో ఆమె తిరగవలసి వుంది. రెండు చోట్లా తెలంగాణ వాదుల నుంచి ప్రతిఘటన ఎదురయ్యే అవకాశం వుంది. దాన్ని ఎదుర్కోవడానికి ఆ పార్టీ నేతలు సిద్ధపడుతున్నారు, షర్మిల యాత్రకు మూడు కిలోమీటర్ల ముందు కొన్ని వందల మంది కార్యకర్తలను నిలపాలని, ఏ తెలంగాణ వాది అడ్డం వచ్చినా

కొరవ 14వ పేజీలో

### • తెలంగాణ రావణ కాష్టంతో...

# ఆవేశకావేషాలు పెరిగిపోతున్నాయి!

తెలంగాణ రావణ కాష్టంలో మళ్లీ మంటలు లేచాయి. ఆ వేడికి అన్ని రాజకీయ పార్టీలూ మల మల మాడి పోతున్నాయి. ఈ పుణ్యం కట్టుకొన్న వాడు కేంద్ర హోంమంత్రి షిండే. సాధారణంగా టిఆర్ఎస్ అధినేత కెసిఆర్, జెఎసి ఛైర్మన్ కోదండరాం వంటివారు తెలంగాణ ఏర్పాటుకు గడువులు పెట్టి, తేదీలు ప్రకటిస్తూ వుంటారు. కానీ ఈసారి మాత్రం విచిత్రంగా హోంమంత్రి తనకు తానుగా గడువు విధించుకొన్నాడు. నెల రోజుల లోపల ఏదో ఒక పరిష్కారమని ప్రకటించి కొరివితో తల గోక్కున్నాడు. ఆ గడువు తీరింది కాబట్టి ఏదో ఒకటి చెప్పండని ఆందోళనకారులు సహజంగానే గోల చేస్తున్నారు. ఏదీ చెప్పే స్థితిలో కేంద్రం లేదు. కేంద్రం తెలంగాణ ఇచ్చేస్తుందన్న భయంతో కెవిపి రామచంద్రరావు సీమాంధ్ర వాదులను రెచ్చగొట్టడంతో పరిస్థితి ముదిరిపాకాన పడింది. రెండు ప్రక్కలా హూంకారాలు, తిట్లు, శాపనార్థాలు విశృంఖలంగా నడిచిపోతున్నాయి. ఆంధ్ర ప్రాంతంలో కూడా ఉద్యమం రాజుకొన్నది. దాన్ని చూసి తెలంగాణ వాదులు రెచ్చి పోతున్నారు. మరొకప్రక్క ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కూడా మంట ఎగదోస్తున్నాడు. హైదరాబాదులో జరిగిన సమర దీక్షలో కెసిఆర్ వాడిన భాష మీద పోలీసు ఫిర్యాదులు చేయిస్తున్నాడాయన. ఒక దశలో ప్రభుత్వమే నేరుగా చర్య మొదలు పెట్టి కెసిఆర్‌ను అరెస్టు చేయాలని సంకల్పించింది. అయితే ఆంతరంగికులు వారించడంతో వెనక్కు తగ్గాడు. ఈ సంఘటనలన్నీ తమను రెచ్చ గొట్టడానికే చేస్తున్నారని ఆందోళనకారులు మండి పడుతున్నారు. ఆంధ్రతో ఇక మాకు తెగ తెంపులు అని మాటలు తూలుతున్నారు. కర్నూలు, విజయవాడ రహదారులను దిగ్బందించాలని ప్రణాళికలు వేసుకొంటున్నారు. అదే జరిగితే రాష్ట్రం స్థంభించిపోతుంది. రెండు ప్రక్కలా ఆవేశకావేషాలు పెరిగి పోతాయి. ఆ పరిస్థితి ఎక్కడకుదారి తీస్తుందో ఎవరూ వూహించలేకున్నారు.

ఇదిట్లా వుంటే కాంగ్రెస్ ఎమ్పీలు రాజీనామాలకు తెగబడ్డారు. ఏడుగురు లోక్‌సభ సభ్యులు తమ రాజీనామా పత్రాలను సోనియాగాంధీ ఇంట్లో ఇచ్చి వచ్చారు. తెలంగాణ ఇవ్వకుంటే కాంగ్రెస్‌తో మాకు విడాకులే అని చెప్తున్నారు. వారి బాధ వారిది. తెలంగాణ విషయంలో కేంద్రం అనుసరిస్తున్న నాన్పుడు వైఖరి వల్ల ఈ ప్రాంతం మొత్తం మీద కాంగ్రెస్ భూస్థాపితమై పోతున్నదని వారి భావన. దాన్ని నమ్ముకొంటే తమకు రాజకీయ భవిష్యత్తు వుండదు కాబట్టి ఏదో ఒక మార్గం చూసుకోవాలన్నది ప్రయత్నం. అయితే తెలంగాణ ప్రాంత మంత్రులు ఆలోచన వేరొక రకంగా వుంది. ఎటూ రేపు ఎన్నికలలో కాంగ్రెస్ గెలిచే పరిస్థితి లేదు. కనీసం ఐదేళ్లపాటు ప్రతిపక్షంలో వుండాలి. అందువల్ల ఇప్పుడు రాజీనామాలు చేసి వున్న పదిహేను నెలల అధికార ప్రాభవాన్ని చేజేతులా వదులుకోవడం ఎందుకన్నది వారి భావన. తెలంగాణ పేరుతో మంత్రి పదవులకు రాజీనామా చేసిన జూపల్లి కృష్ణారావు,

కొరవ 14వ పేజీలో

# బండబారిపోయిన మనసులు!

తెలంగాణ రాష్ట్రాన్ని ఆకాంక్షిస్తూ ఆత్మ త్యాగాలు చేస్తున్న యువకుల తీరు మనసును మెలి పెడుతున్నది. ఈ ఒక్క వారంలోనే నలుగురు ముక్కు పచ్చలారని బిడ్డలు తమను తాము చంపుకొన్నారు. వారేమీ చదువు సంధ్య లేని ఆవారాగాళ్లు కాదు. బిటెక్ వంటి ఉన్నత విద్యలు అభ్యసిస్తున్న వారు. ప్రపంచ జ్ఞానం లేని మూర్ఖులు కారు. హైదరాబాదు నగరంలో బ్రతుకుతూ, ఇంటర్నెట్ వంటి ఆధునిక ప్రపంచ సమాచార సాధనాలను విస్తృతంగా వినియోగిస్తున్న నవతరం యువకులు. రాజకీయ పార్టీల కార్యకర్తల్లో, నాయకుల వెనుక తిరిగే అల్లరి చిల్లరి మూకలో కాదు. రాజకీయంతో కానీ, ఉద్యమంతో కానీ వీసమెత్తు సంబంధం లేని వారు. కుటుంబ పరంగానో, ఆర్థికపరంగానో సమస్యలున్న వారు కూడా కాదు. కేవలం తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలన్న ఆకాంక్షను తమ మనసులలో బలీయంగా పెంచుకోవడం ఒక్కటే వారిలో కన్పిస్తున్న ఏకైక ఉన్మాదం. ఢిల్లీలో కానీ, రాష్ట్రంలో కానీ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు విఘాతం కలిగే పరిణామాలు సంభవిస్తున్న ప్రతిసారీ ఈ ఆత్మహత్యల పరంపర కొనసాగుతున్నది. నిండు నూరేళ్లు బ్రతికి, జీవితంలో ఎంతో ఉన్నతి సాధించే అవకాశం వున్న యువకులు ఇట్లా తమ జీవితాన్ని అర్ధాంతరంగా చిదిమి వేసుకోవడం మాటల్లో చెప్పలేని బాధకల్గిస్తున్నది. ప్రపంచ చరిత్రలో మరే ప్రజా ఉద్యమంలో కూడా ఇటువంటి బలిదానాలు జరిగిన సాదృశ్యాలు లేవు. ఈశాన్య రాష్ట్రాలలో, పంజాబ్ వంటి ప్రాంతాలలో, శ్రీలంకలో జరిగిన వేర్పాటువాద ఉద్యమాలు హింసాయుతంగా నడిచాయి. కానీ అక్కడ ఉద్యమకారులు ఇతరుల ప్రాణాలను బలిపెట్టి తమ ఉద్యమాన్ని విస్తృతం చేసుకొన్నారే తప్ప తమకు తాము బలి పీఠంపై నిలబడలేదు. గతంలో మన రాష్ట్రంలో జరిగిన తెలంగాణ, జై ఆంధ్రా ఉద్యమాలలో సైతం ఈ ధోరణి లేదు. కానీ కెసిఆర్ ప్రారంభించిన ఉద్యమం మాత్రం దాదాపు వెయ్యి మంది అమాయక యువకుల ప్రాణాలను బలి తీసుకొన్నది.

కెసిఆర్ మంచివాడా చెడ్డవాడా అన్న మీమాంస పక్కన పెడితే, తెలంగాణ ప్రాంతంలో ప్రత్యేకవాద భావాలను ప్రజల మనసులలోకి చొప్పించడంలో మాత్రం సఫలీకృతమైనాడన్న నిజాన్ని అందరూ అంగీకరించక తప్పదు. ఆవేశపూరిత ఉపన్యాసాలు, హింసకు తావు లేని రాజకీయ ఆందోళనలతో మాత్రమే కోట్లాది మంది మనసులలో తాను నమ్మే భావజాలాన్ని అంతర్లీనం చేయడం చాలా గొప్ప విషయం. అదెంత బలీయంగా పాతుక పోతున్నదో అర్థం చేసుకోవడానికి వెయ్యి మంది యువకుల ఆత్మత్యాగాలే నిదర్శనం.

2001లో విద్యుత్ ఛార్జీల పెంపుకు నిరసనగా ప్రతిపక్షాలు జరిపిన ఉద్యమంలో బషీర్‌బాగ్ కాల్పుల దుర్ఘటన కీలకమైనది. అందులో ముగ్గురు ఆందోళనకారులు బలైపోయారు. అది చంద్రబాబు రాజకీయ జీవితానికి మరణ శాసనం వలె పరిణమించింది. జై ఆంధ్రా ఉద్యమంలో కానీ, గతంలో జరిగిన తెలంగాణ ఉద్యమాలలో కానీ, విశాఖ ఉక్కు ఆందోళనలో కానీ పోలీసు కాల్పులు కీలక పాత్ర పోషించాయి. కాల్పులలో ఆందోళనకారుల మరణం ఆయా ఆందోళనలకు ముగింపు పలికాయి. కానీ ఇప్పుడు మాత్రం పచ్చటి జీవితాలను మసి చేసుకొంటున్న యువతీ యువకుల బలిదానాలు ఎవరి మనసునూ కరిగించడం లేదు. ఉద్యమంపై కానీ, ప్రభుత్వంపై కానీ, ప్రజల ఆలోచనలపై కానీ ఈ నిర్భాగ్య యువకుల ప్రాణదానాలు అణువంత ప్రభావం చూపలేక పోతున్నాయి. ఎంతో దురదృష్టకరమైన వాస్తవం ఇది. మనిషి ప్రాణానికి మన సమాజం, మన నాయకులు ఇస్తున్న విలువ ఇంతేనా అన్న బాధ కలుగుతున్నది. కనీసం యువకులను ఆత్మహత్యల ఉన్మాదం నుంచి తప్పించడానికి కూడా ఏ రాజకీయ పార్టీ, సాంఘిక సంస్థ కనీస పాటి ప్రయత్నం చేయడం లేదు. ప్రభుత్వం అసలే పట్టించుకోవడం లేదు. ప్రపంచంలోని మరే సమాజంలో కూడా ఇంతటి బండ్రాతి గుండెలుండవన్నది నిజం. ఒక్క పోలీసు కానిస్టేబుల్ దౌష్ట్యానికి నిరసనగా టునీషియా ప్రజలు వీధులలోకి వస్తే ఈజిప్ట్‌తో సహా అరబ్ సమాజం మొత్తం నిశ్శబ్ద విప్లవానికి లోనైంది. ఢిల్లీలో ఒక్క యువతిపై జరిగిన దారుణ మానభంగం యావత్ భారత జాతిని చైతన్య పరచింది. కానీ తెలంగాణలో నిత్యం జరిగిపోతున్న యువకుల ప్రాణ త్యాగాలు మాత్రం ఎవరి మనసులనూ కదిలించడం లేదు. అంత బండబారిపోయాయి మన మనసులు?

జమీన్‌రైతు

## జనవాణి

### బిల్లులపేర విద్యుత్‌శాఖ మోసం!

రాష్ట్రంలో ప్రహసనంగా మారిన విద్యుత్ వినియోగ బిల్లులతోపాటు సర్‌ఛార్జ్ అదనంగా చెల్లింపు విషయం గందరగోళంగా వుంది. విద్యుత్‌శాఖ హైకోర్టు ఆదేశాల మేరకు డిసెంబర్ నెల బిల్లుల్లో ముందుగానే సర్‌ఛార్జ్ నమోదైనందున ఈ మొత్తం తగ్గించి బిల్లులు జారీ చేస్తామని స్పష్టంగా ప్రకటించిన విషయం ప్రముఖ దినపత్రికలు ప్రచురించాయి. వాస్తవంగా ఆ సూచనలు అమలు కాలేదు. మాకెలాంటి ఉత్తర్వులు లేవని సదరుశాఖ వారు, రికార్డ్ అయిన బిల్లు తగ్గించి జమ చేసుకొనే అవకాశం లేదని ఈ–సేవ వాళ్లు చెప్పడంతో యథావిధిగా మొత్తం బిల్లు చెల్లించక తప్పలేదు. జనవరి నెలలో తగ్గింపు కాదు కదా జూలై 2010 మరియు 2012 జూన్ నెలలకు చెందిన సర్‌ఛార్జ్ అంటూ బిల్లు ముట్టుకొంటే షాక్ కొట్టేలా చేశారు. విద్యుత్‌శాఖ ఎస్‌ఇ నందకుమార్ ఎలాంటి వివరణ ఇవ్వకుండా మొత్తం బిల్లు చెల్లించక తప్పదని యమఘాటుగా ప్రకటించారు. మొత్తానికి ఇవన్నీ చూస్తుంటే విద్యుత్‌శాఖ వినియోగదారులను మోసం చేసే స్థాయికి దిగజారినట్లుంది. తన పార్టీ ఎలాగు అధికారంలోకి వచ్చేది లేదని తేల్చుకొన్న ముఖ్యమంత్రి ప్రజల పట్ల కసి తీర్చుకొంటున్నాడు. ఈ వ్యవహారంలో లోక్‌సత్తా వంటి పార్టీలు ప్రజలకు న్యాయపరంగా చేయూతనిస్తే బాగుంటుంది.

ములుమూడి ప్రభాకర్‌రావు — నెల్లూరు

### లోకాయుక్త స్పందన బాగుంది!

జస్టిస్ బి.సుభాషణ్‌రెడ్డి లోకాయుక్త బాధ్యతలు స్వీకరించిన నాటి నుంచి బాధితుల ఫిర్యాదులపై తక్షణం స్పందిస్తున్న తీరు చాలా బాగుంది. జిల్లా కేంద్రమైన నెల్లూరులో పురాతన కోనేరు ఆక్రమణలపై ఫిర్యాదులు అందిన వెంటనే తక్షణం వారు చూపిన స్పందన హర్షణీయం. అదేవిధంగా హైదరాబాద్ సమీపంలోని మణికొండ ప్రాంతంలో అక్రమ నిర్మాణాలపై లోకాయుక్త వెంటనే స్పందించింది. వివిధ కేసులకు సంబంధించి ఫిర్యాదుదారులు ఫిర్యాదు చేసిన వెంటనే తక్షణం బాధితుల పక్షాన నిలిచి వారికి అండగా ఉంటున్న జస్టిస్ సుభాషణ్‌రెడ్డికి అభినందనలు.

ఎస్.బాబురావు — కావలి

### వీధుల్లో విగ్రహాలను తొలగించాలి!

ఏ లగ్నాన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందో అది లగాయతు రాజకీయవాదిలో దుర్బుద్ధి పుట్టింది. నాయకులు ఏకపక్ష నిర్ణయాలు తీసుకొని అవినీతి, స్వార్థబుద్ధితో చెలరేగిపోతున్నారు. నాయకుల మెప్పు కోసం భృత్యులు వీధుల్లో విగ్రహాలు పెడుతున్నారు. నెల్లూరు లాంటి చోట్ల విగ్రహాల చుట్టూ కట్టిన ట్రాఫిక్ ఐల్యాండ్లు నగరంలో ట్రాఫిక్ కదలకుండా చేస్తుంటే చూస్తూ ఊరుకొంటున్నారు తప్ప చర్యలు లేవు. ఈ దశలో వీధుల్లో ప్రజలకు ఇబ్బంది కల్గించే

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**5-2-1943**
**పేజీలు : 6 వెల: 0-1-6**

### నెల్లూరు ముచ్చట్లు

**పరామర్శలు:**

అల్లూరు వాస్తవ్యులును, పంచాయితీ బోర్డు అధ్యక్ష పదవిని సార్థకం జేసిన వారును, కోవూరు తాలూకా రైతు సంఘాధ్యక్షులును, యువకుడు, త్యాగి, ప్రజాసేవకుడైన నూకలపాటి వెంకట రమణారెడ్డి గారు 30వ తేది అకాల మరణము వాతబడిరని తెలుపుటకు చింతించుచున్నాము. వారి కుటుంబానికి మా సానుభూతి.

* * *

రేబాల దశరథరామిరెడ్డి గారి ధర్మపత్ని 2వ తేది రాత్రి మరణించుట సంతాపకరం. దశయ్య గారికి, వారి కుటుంబానికి మా సానుభూతి,

– విమర్శకుడు

### నెల్లూరు జిల్లాలో భూకంపం

రాపూరు తాలూకా, ఆత్మకూరు తాలూకాలో తాటిపర్తి వగైరా చోట్ల నుండి నెల్లూరు తాలూకా మినగల్లు, వెల్లంటి, ములుమూడి వగైరా చోట్ల నుంచి వచ్చిన వార్తలను బట్టి 20–1–1943 రాత్రి 10 గంటలకు షుమారున పెద్ద శబ్దమై భూమి కంపించినట్లు చెబుతున్నారు.

నెల్లూరు తాలూకా మడమనూరులో ఆ ప్రళయభీకర శబ్దమే గాదు, భూమి గడగడ వణికిందనీ, ఇండ్లు పడిపోతాయనే భయంతో ప్రజలంతా ఇండ్లు వదిలిపెట్టి వీధుల్లోకి పరుగెత్తారని గూడా చెబుతున్నారు.

నెల్లూరు టవున్‌లో అట్టి శబ్దమేమీ కనుపించలేదు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**1-2-1963**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ఛైర్మన్‌గా పేరూరు లక్ష్మణ గుప్త!

నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ఛైర్మన్‌గా పేరూరు లక్ష్మణ గుప్త గత 30వ తేది కౌన్సిల్ ప్రత్యేక సమావేశంలో ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఈ సమావేశానికి కౌన్సిలరు పి.వి.సుబ్బారెడ్డి గారు తాత్కాలిక అధ్యక్షులుగా ఎన్నుకోబడి, ఎన్నికను నిర్వహించారు. లక్ష్మణగుప్త గారి పేరును పి.సుబ్బరాయుడు ప్రతిపాదించగా, ఆర్.దేవదానం గారు బలపరచారు.

### వెంకటగిరి సింహాసనం

వెంకటగిరి రాజాగారైన రాజా వెలుగోటి సర్వజ్ఞ కుమారకృష్ణ యాచేంద్రుల వారి సింహాసనమునకును 600 ఏండ్ల క్రితం చేసి తాపింపబడిన 7460 గ్రాముల తూకం గల స్వచ్ఛమైన బంగారు రేకులను తీసి ఈ రోజు(1–2–63) గూడూరు స్టేటు బ్యాంకులో జాతీయ బంగారు బాండ్లలో పెట్టుబడి పెట్టినారు. వీటి విలువ షుమారు 50వేలు ఉంటుంది.

### భద్రాద్రి రాముడికి రూ.25,000లు!

భద్రాద్రి రాముణ్ణి సేవించుటకు పోయిన రేబాల లక్ష్మీనరసారెడ్డి గారు యాత్రీకుల సౌకర్యార్థం నిర్మాణమవుతున్న సత్రంలో 5 బ్లాకులకు 25వేల రూపాయలు యిచ్చుటకు వాగ్దానం జేసివచ్చారట. తన ఈ నిర్ణయాన్ని ఆలయ పునరుద్ధరణ కృషికి పునాదులు వేసిన రామభక్తుడు కల్లూరి చంద్రమౌళి గారికి కూడా వ్రాశారట.

లక్ష్మీనరసారెడ్డి దాతృత్వానికి మా అభినందనలు. చెప్పిన షరతులు పాటింపబడితే ఏ ధర్మకార్యానికైనా ఎన్ని లక్షలైనా క్రుమ్మరించుటకు లక్ష్మీనరసారెడ్డి గారు సిద్ధంగా ఉంటారు.

# నెల్లూరు ముచ్చట్లు

విహంగవీక్షణం

## ముఖ్యమంత్రి రాక

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఇందిరమ్మ బాట కార్యక్రమంలో పాల్గొనను 7,8,9 తేదీల్లో జిల్లాకు రానున్నట్లు తెలిసింది. ఆయన పర్యటించే ప్రాంతాలు మాత్రం ఇంకా ఖరారు కాలేదు.

## శాసన సభా కమిటీ పర్యటన!

సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి నేతృత్వంలోని ఎపి లెజిస్లేటివ్ అసెంబ్లీ కమిటీ 28వ తేదీ నెల్లూరులో పర్యటించింది. ఎపి జెన్‌కో, ట్రాన్స్‌కో, పౌరసరఫరాల కార్పొరేషన్లు, ఆర్టీసి, పర్యాటక సంస్థల ప్రగతిని హోటల్ హరితలో సమీక్షించింది.

నెల్లూరు ఆర్టీసి బస్టాండ్‌ను సందర్శించిన కమిటీ ఇక్కడ కనీస సౌకర్యాలు లేకపోవడం చూసి నోరెళ్ల బెట్టింది. ఈ బస్టాండ్‌ను విశాలమైన చోటుకు మార్చమని కమిటీలో పెద్దనోరున్న సభ్యురాలు నన్నపనేని రాజకుమారి అధికారులను కోరారు. ఇదే విషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసుకవెళ్తానన్నారు. కమిటీ సభ్యులు కృష్ణపట్నం పోర్టు, జొన్నవాడ దేవస్థానం, శ్రీహరికోటలోని షార్ కేంద్రాన్ని సందర్శించారు.

## ఇందిరాభవన్‌కు వారసులు!

ఆనం వివేకానందరెడ్డి జన జీవన స్రవంతిలో తిరగమని తన వారసులను ఆదేశించకపోయినా వాళ్లు రంగంలో దూకేశారు. వివేకానందరెడ్డి చిన్న కుమారుడు ఆనం రంగమయూర్‌రెడ్డి ఈ మధ్య నగరంలో పదుల సంఖ్యలో ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలకు హాజరవుతున్నాడు. 26వ తేదీ ఇందిరా భవన్‌లో జరిగిన నెల్లూరు రూరల్ నియోజకవర్గ కాంగ్రెస్ కార్యకర్తల సభకు మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ సభా వేదికపై ఆనం రంగమయూర్‌రెడ్డి, ఆనం కార్తీక్‌రెడ్డి (విజయకుమార్‌రెడ్డి కుమారుడు) వేదికెక్కి కూర్చోవడంతో అందరూ వీరిపై దృష్టి కేంద్రీకరించారు. అయితే రామనారాయణరెడ్డి వీరిద్దరికీ మైకు ఇవ్వకుండా జాగ్రత్త పడ్డాడు. పైపెచ్చు ఈ సభలో ఆనం విజయకుమార్‌రెడ్డిని ఆవేశం తగ్గించుకోమని నర్మగర్భంగా వ్యాఖ్యానించారు.

## సూర్య నమస్కారాలు చేస్తున్న నాగుపాము!

నెల్లూరు నగరానికి కూతవేటు దూరంలోని కనుపర్తిపాడు గ్రామ శివార్లలోని పాములపుట్ట వద్ద ప్రతినిత్యం ఓ నాగుపాము ఉదయం, సాయంత్రం పుట్ట నుంచి బయటకు వచ్చి సూర్య నమస్కారాలు చేయడం చర్చనీయాంశమయ్యింది. ఈ పుట్టను నగర ప్రముఖులు పలువురు సందర్శించడంతోపాటు ఇక్కడ శాశ్వత పూజా పునస్కారాల కోసం తగిన ఏర్పాట్లు మొదలు పెట్టారు.

## మార్చి నెలాఖరుకు నెల్లూరుకు వివేకా?

మార్చి నెలాఖరుకు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నెల్లూరుకు వస్తారని ఆయన సన్నిహిత వర్గాలు తెలిపాయి. ఆరు నెలలపాటు వివేకానందరెడ్డి నెల్లూరుకు రారన్నది ఉత్త అపోహే అంటున్నారు.

## విఆర్‌కాలేజి కమిటీలో అయ్యోరు!

నెల్లూరు విఆర్‌కాలేజి పాలకవర్గ సభ్యునిగా ఉన్న నగర కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు చాట్ల నరసింహారావుకు ప్రమోషన్ లభించింది. ఆయన్ను వివేకానందరెడ్డి విఆర్ కాలేజి కమిటీ కోశాధికారిగా నియమించారు. వంశపారంపర్య ధర్మకర్తలు జీవించి ఉండగానే పాలకవర్గం మారకూడదని దేవాదాయశాఖ నిబంధనలలో ఉండడంతో నెల్లూరు వేణుగోపాలస్వామి దేవస్థానం కమిటీలో మార్పులు చివరి నిమిషంలో ఆగిపోయాయట.

## రాజీనామా గీకేసిన శ్రీధర్‌కృష్ణారెడ్డి!

రాష్ట్ర విభజనను వ్యతిరేకిస్తూ నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మరోసారి రాజీనామా పత్రం వ్రాసిచ్చారు. విద్యార్థి జెఏసి సమైక్యాంధ్రకు మద్దతు ప్రకటించమని కోరుతూ ఆయన ఇంటిని ముట్టడించగా వారు కోరినట్లు రాజీనామా పత్రం వ్రాసిచ్చారాయన.

తెలంగాణ ఏర్పాటుపై పాత హోం మంత్రి చిదంబరం విధాన ప్రకటన చేసిన సమయంలోనూ ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి రాజీనామా చేసి ఆ తర్వాత ఉపసంహరించుకొన్నారు.

## నెల్లూరులో చినజీయర్ స్వామి!

చినజీయర్‌స్వామి 24వ తేదీ నెల్లూరు వచ్చారు. సోమశిల ఆశ్రమంలో జరిగిన ప్రత్యేక యజ్ఞంలో పాల్గొన్న స్వామి పొదలకూరురోడ్డులోని ఓ భక్తుని ఇంట బస చేశారు. మాగుంట లేఅవుట్‌లోని గోమతి గ్లోబల్ స్కూల్‌లో సుదర్శన చక్రాన్ని స్వామి ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో స్కూల్ అధినేతలు డాక్టర్ రాజశేఖర్, అరుణ పాల్గొన్నారు.

## ఎలక్ట్రానిక్ మీడియా డైరీ ఆవిష్కరణ!

ఎపి ఎలక్ట్రానిక్ మీడియా జర్నలిస్ట్స్ నెల్లూరు జిల్లా శాఖ ముద్రించిన 2013 సంవత్సరం డైరీని 28వ తేదీ ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి జడ్పీ మీటింగ్ హాల్‌లో ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఎలక్ట్రానిక్ మీడియాలో పనిచేసే జర్నలిస్టులు వార్తాసేకరణకు ఖర్చు పెడుతున్న పెట్రోల్, ఇతర ఖర్చులు, జీతాన్ని యాజమాన్యాన్ని డిమాండ్ చేసి పొందాలే తప్ప ఈ విషయంపై కూడా ప్రభుత్వంపై ఆధార పడకూడదన్నారు. ఎలక్ట్రానిక్ మీడియా వల్ల కలుగుతున్న అనర్థాలను తెలివిగా మంత్రి ఈ సందర్భంగా వెల్లడించారు. ఎలక్ట్రానిక్ మీడియా జర్నలిస్టుల సంఘం అధ్యక్షుడు దూదల విజయకుమార్, కార్యదర్శి గౌస్‌లాజం ఈ కార్యక్రమం జయప్రదమయ్యేందుకు గట్టి కృషి చేశారు.

## విశ్వరూపం సినిమాపై రగడ!

విశ్వరూపం సినిమాలో ముస్లింలను తీవ్రవాదులుగా చూపడం అన్యాయమంటూ పాపులర్ ఫ్రంట్ ఇండియా కార్యకర్తలు 28వ తేదీ నర్తకి థియేటర్ వద్ద నిరసన ప్రదర్శన చేశారు. నెల్లూరులో ఈ సినిమా ప్రదర్శనను ఆపివేయాలని ఆగం చేశారు. తాము సినిమా చూసి ప్రదర్శనకు అనుమతిచ్చామంటూ త్రీటౌన్ పోలీసులు వీరిని అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్‌కు తరలించారు.

## ఎర్రగడ్డలు @ 25 రూపాయలు!

నెల్లూరు మార్కెట్‌లో ఎర్రగడ్డల రేటు అనూహ్యంగా పెరిగి పోయింది. పచ్చిగడ్డలు కిలో 25 రూపాయలకు అమ్ముతున్నారు. డిశంబర్ నెలలో ఎర్రగడ్డలు కిలో పదమూడు, పదిహేను రూపాయల మధ్య రేటుండినాయి. ఈ పెరుగుదలను సామాన్య, మధ్యతరగతి ప్రజలు భరించలేకున్నారు.



కోళ్ల పరిశ్రమ పితామహుడు, వెంక్ వ్యవస్థాపకుడు డాక్టర్ బివి.రావు వర్ధంతి సందర్భంగా ఆయన చిత్రపటానికి పూలమాల వేసి నివాళులర్పిస్తున్న బలరామయ్య నాయుడు, ఎం.ఆర్.ప్రసాద్ తదితరులు

## ఆర్టీసి వ్యాపారస్తుల సంక్షేమ సంఘం!

ఎపిఎస్ ఆర్టీసి వ్యాపారస్తుల సంక్షేమ సంఘం 28వ తేదీ నెల్లూరు

కొరవ 14వ పేజీలో

# సెంట్రల్ బ్యాంకు కాంగ్రెస్‌దే!

**● కార్యకర్తల సమావేశంలో ఆనం రామనారాయణరెడ్డి**



ఇందిరాభవన్‌లో మాట్లాడుతున్న రామనారాయణరెడ్డి.

జిల్లా కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ అధ్యక్ష పదవి కాంగ్రెస్ పార్టీకే దక్కుతుందని ఇందులో ఎటువంటి సందేహం లేదని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నొక్కివక్కాణించారు. 26వ తేది రాత్రి ఇందిరాభవన్‌లో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. మొదటి విడత నామినేషన్లు పూర్తయిన దశలోనే 15 స్థానాలను పార్టీ ఏకగ్రీవంగా గెల్చుకొందన్నారు. రైతాంగానికి అన్నివిధాల మేలు చేసింది కాంగ్రెస్ పార్టీనే అన్నారు. 72వేల కోట్ల రూపాయల రుణాలు మాఫీ చేసింది, 32 లక్షల మోటార్లకు ఉచిత విద్యుత్ ఇస్తున్నది కాంగ్రెస్ పార్టీనేనన్నారు. ధాన్యానికి మద్దతు ధర కల్పించింది; సోమశిల, కండలేరు జలాశయాలు నీటి సామర్థ్యం పెంచింది కాంగ్రెస్సే అన్నారు. రాజకీయాల్లో విమర్శలు, ప్రతి విమర్శలు సహజమని విజయం దక్కే సమయంలో సంయమనం పాటించాలని హితవు పలికారు. మనం పై మెట్టుపై ఉన్నాము. అతిగా ఆలోచించొద్దు; ఎంత ఎత్తు ఎదిగినా ఒదిగి ఉండాలి. ఒదిగి ఉన్నప్పుడే భవిష్యత్తుకు మంచి మార్గం లభిస్తుంది. ఓర్పుతో, నేర్పుతో ముందుకు సాగండి. ఆవేశకావేశాలొద్దన్నారు. సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ కాంగ్రెస్ కార్యకర్తలు కష్టించి పని చేసి సహకార ఎన్నికల్లో మెజార్టీ స్థానాలు సాధించాలన్నారు. చాట్ల నరసింహారావు, ఆనం విజయకుమార్‌రెడ్డి, ఆనం రంగమయూర్‌రెడ్డి, ఆనం కార్తీక్‌రెడ్డి కూడా ఈ సభలో పాల్గొన్నారు.

**● ఘనంగా చంద్రారెడ్డి**

# డిగ్రీ కళాశాల పదవ వార్షికోత్సవం!



చంద్రారెడ్డిని సన్మానిస్తున్న ప్రతాప్‌కుమార్‌రెడ్డి, రామకృష్ణారెడ్డి.

నెల్లూరు వహాబ్‌పేటలోని శ్రీ చంద్రారెడ్డి డిగ్రీ కాలేజి పదవ వార్షికోత్సవ వేడుకలు 22వ తేది జీపిఆర్ గ్రాండ్ కళ్యాణ మండపంలో వేడుకగా జరిగాయి. ఈ కార్యక్రమానికి డైరక్టర్ చంద్రారెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. విఎస్ యూనివర్శిటీ స్థాపించిన మొదటి సంవత్సరమే కాకుండా రెండవ సంవత్సరంలో కూడా చంద్రారెడ్డి డిగ్రీ కాలేజి విద్యార్థులే యూనివర్శిటీ ప్రథములుగా నిలవడం గర్వంగా ఉందన్నారు. విద్యార్థుల తల్లితండ్రులు తమపై ఉంచిన నమ్మకాన్ని ఎప్పటికి ఇదేవిధంగా నిలబెట్టుకుంటామన్నారు. కరస్పాండెంట్ కోటంరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ క్రమశిక్షణ, అంకితభావం, అణుకువతో జీవితంలో ఉన్నత శిఖరాలను చేరుకోవచ్చని విద్యార్థులకు సూచించారు. ఈ సందర్భంగా విద్యాసంస్థల అధినేత చంద్రారెడ్డి గౌరవ సలహాదారులు రామకృష్ణారెడ్డి, పదేళ్లుగా పనిచేస్తున్న అధ్యాపకులు, అధ్యాపకేతర సిబ్బందిని సన్మానించారు. ఈ కార్యక్రమంలోనే విద్యార్థినీ, విద్యార్థులకు ప్రతిభా పురస్కార్ అవార్డులు, మరియు అకడమిక్ టాపర్స్‌కు లక్ష రూపాయలు నగదు బహుమతి ఇవ్వడం జరిగింది. ఈ సందర్భంగా విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు అందరినీ అలరించాయి.

# ఫ్రీ పాస్ పిల్లలను ఇబ్బంది పెడుతున్నారు!

**ఆర్టీసి కండక్టర్ల తీరుమారాలి**

విద్యార్థులకు చదువుకు ఆటంకం కలుగకుండా ఉండేందుకు సమీప ప్రాంతాల్లోని పాఠశాలలు, కళాశాలలకు వెళ్లేందుకుగాను ప్రభుత్వం ఆర్టీసి బస్సుల్లో ప్రయాణించేందుకు ఉచిత పాసులను అందిస్తోంది. వీటిని ఉపయోగించుకొని 15 ఏళ్లలోపు వయసుగల విద్యార్థినీ విద్యార్థులు చదువుకోవాలన్నది ప్రభుత్వ ఉద్దేశం. 18 ఏళ్లకు పైబడిన వారికి రాయితీతో కూడిన పాసులు జారీ చేస్తోంది. అంతవరకు బాగానే ఉన్నా పాసులను జారీ చేసిన ఆర్టీసి వారి బస్సుల్లోనే విద్యార్థులను సమయం మించి పోయిందని, నిర్ణీత వేళల్లోనే బస్సులు ఎక్కాలని ఆంక్షలు పెడుతూ పిల్లలను బస్సుల్లో ఎక్కించుకోక పోవడం వల్ల వివిధ ప్రాంతాలకు చదువు కోసం వచ్చే విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ముఖ్యంగా పేద పిల్లలు డబ్బులు చెల్లించి బస్సులు, ఆటోల్లో ప్రయాణించాల్సి వస్తోంది. మధ్యాహ్నం తరగతులకు వెళ్లే విద్యార్థులు 12 గంటలలోపు బస్సు ఎక్కాలని ఆ సమయం దాటితే బస్సు ఎక్కించుకోక పోతుండడంతో విద్యార్థులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. రాత్రివేళల్లోనూ ఆర్టీసి సిబ్బంది బస్సుల్లో పాసు కలిగి ఉండే పిల్లలను ఎక్కించుకోక పోతుండడంతో చదువు కోసం దూర ప్రాంతాలకు వచ్చే విద్యార్థులు అవస్థలు పడాల్సి వస్తోంది. దీంతో విద్యార్థులు గమ్యాన్ని చేరను ప్రైవేట్ బస్సులను, ప్రమాదమని తెలిసినా ఆటోల్లోనే ప్రయాణించాల్సి వస్తోంది.

# అభివృద్ధే లక్ష్యంగా పనిచేద్దాం!

**● రిపబ్లిక్ డే సందేశంలో కలెక్టర్**



గౌరవ వందనం స్వీకరిస్తున్న కలెక్టర్.

అభివృద్ధే లక్ష్యంగా పనిచేసి జిల్లాను ప్రగతి పథంలో నడిపిద్దామని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి పిలుపునిచ్చారు. 64వ గణతంత్ర దినోత్సవపు వేడుకలను పురస్కరించుకొని 26వ తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో జాతీయ జెండాను ఆవిష్కరించి పోలీస్ గౌరవ వందనాన్ని స్వీకరించి జిల్లాలో జరుగుతున్న అభివృద్ధి పనులపై మాట్లాడారు. జిల్లా ప్రజల చిరకాల స్వప్నమైన మెడికల్ కాలేజికి 362 కోట్ల రూపాయలు మంజూరయ్యాయని, ఆ నిధులతో భవన నిర్మాణ పనులు చేపట్టబోతున్నామన్నారు. సోమశిల హైలెవల్ కెనాల్‌కు 785 కోట్ల రూపాయలతో పరిపాలనాపరమైన అనుమతులు మంజూరయ్యాయన్నారు. జిల్లాలో 8.47 లక్షల మంది నిరుపేదలకు ప్రతి నెలా రూపాయికే కిలో సన్న బియ్యం అందిస్తున్నామన్నారు. ఇందిర జలప్రభ పథకం ద్వారా 40 మండలాల్లో షెడ్యూల్ కులాలకు చెందిన 15వేల మందికి 25వేల ఎకరాల భూమిని అభివృద్ధి చేసేందుకు 40 కోట్ల రూపాయలతో ప్రణాళికలు సిద్ధం చేశామన్నారు. సంపూర్ణ పారిశుద్ధ్య సౌకర్యాల కల్పనే ధ్యేయంగా నిర్మల్ భారత్ అభియాన్ పథకం ద్వారా జిల్లాలోని 46 మండలాల్లోని 236 గ్రామ పంచాయితీలను తొలి విడతగా ఎంపిక చేసి 61,966 మరుగుదొడ్లను నిర్మిస్తున్నామన్నారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం ద్వారా జిల్లాలో 5.15 లక్షల కుటుంబాలకు జాబ్ కార్డులు మంజూరు చేసి 152 కోట్ల రూపాయలతో పని కల్పించేందుకు లక్ష్యంగా నిర్ణయించామన్నారు. జలయజ్ఞం పథకంలో భాగంగా 249 కోట్ల రూపాయలతో నెల్లూరు – సంగం బ్యారేజీలను నిర్మిస్తున్నామన్నారు. ఈ కార్యక్రమంలో ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎస్పీ బి.వి.రమణకుమార్, ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, జెసి లక్ష్మీకాంతం, అధికారులు పాల్గొన్నారు.

# డబ్బుతో సహకారం!



సహకార అధికారిని నిలదీస్తున్న వైకాపా నాయకులు.

డబ్బు ఏ ఎన్నికలనైనా శాసించే రోజులివి. సహజంగా ప్రాథమిక వ్యవసాయ సహకార ఎన్నికలు డబ్బుతో ప్రమేయం లేకుండా జరిగేవి. ఈ సారి ఇవి ఖరీదయ్యాయి. అధికార పార్టీ సభ్యత్వాలు మొదలు, అప్పు చెల్లింపు వరకు ఒక పథకం ప్రకారం పావులు కదపడంతో తొలివిడత ఎన్నికల్లో అధికార పార్టీ కాంగ్రెస్‌నే మెరుగ్గా కనిపిస్తుంది. జిల్లాలోని 99 సహకార సంఘాలకు సంబంధించి మొదటి విడతలో 56 సొసైటీలకు ఎన్నికలు జరుగనున్నాయి. వీటికి సంబంధించి 25వ తేది నామినేషన్ల ఘట్టం ముగిసింది. 26వ తేది నామినేషన్ల ఉప సంహరణకు చివరి తేది కావడంతో అధికార పార్టీ నేతలు చక్రం తిప్పారు. దీంతో అత్యధికంగా 13 స్థానాల్లో కాంగ్రెస్ పార్టీ, మూడు స్థానాల్లో వైకాపా, రెండు చోట్ల తెలుగుదేశం పార్టీలు ఏకగ్రీవంగా సొసైటీలను దక్కించుకొన్నాయి. మిగిలిన 38 సంఘాలకు ఎన్నికలు ఈ నెల 31వ తేది జరుగనున్నాయి. వీటిలో మూడు సంఘాలకు ఎన్నికలను వివిధ కారణాల చేత నిలిపి వేశారు. మొదటి విడత ఎన్నికలు జరిగే సహకార సంఘాల జాబితాల్లో ఆత్మకూరు, అనంతసాగరం, ఎఎస్‌పేట, నెల్లూరు రూరల్, గూడూరు, చిల్లకూరు, కోట, ఓజిలి, నాయుడుపేట, పెళ్లకూరు, సూళ్లూరుపేట, తడ, దొరవారిసత్రం, వాకాడు, చిట్టమూరు, బోగోలు, బుచ్చి, సంగం, కోవూరు, అల్లూరు, దగదర్తి మండలాల్లో కొన్ని సొసైటీలున్నాయి.

# ఆగని గుట్కాల విక్రయాలు

రాష్ట్ర ప్రభుత్వం మత్తు పదార్థాలైన గుట్కాలను నిషేధించినప్పటికీ జిల్లావ్యాప్తంగా రహస్యంగా వీటి విక్రయాలు కొనసాగిస్తున్నారు. నిషేధం విధించే నాటికి జిల్లాలో దాదాపు పది కోట్ల రూపాయలు విలువచేసే గుట్కాలు నిల్వ ఉన్నాయి. వీటిని బహిరంగంగా దుకాణాల్లో విక్రయించకుండా రహస్యంగా భద్రపరచి విక్రయిస్తున్నారు. గతంలో రూపాయి విలువచేసే మానిక్‌చంద్ నిషేధం పుణ్యమా అని మూడు రూపాయల నుంచి ఐదు రూపాయల ధర పలుకుతుంది. 15 సంవత్సరాలు వచ్చిన వారి దగ్గర నుంచి 60 సంవత్సరాలు నిండిన వారి వరకు గుట్కాలు నములుతున్నారు. జిల్లాలో దాదాపు మూడు కోట్ల రూపాయల వ్యాపారం నెలలో జరుగుతుండేది. వీటి కారణంగా అనారోగ్యం సమస్యలు ఎదురౌతున్నాయని నిర్ధారణ కావడంతో ప్రభుత్వం వీటి విక్రయాలను పూర్తిగా నిషేధించింది. గుట్కాకు అలవాటు పడిన యువత వీటి కోసం గతంలో కొనుగోలు చేస్తున్న కిళ్లీ షాపుల వారికి ముందుగానే అడ్వాన్స్ చెల్లించి కొనుగోలు చేస్తున్నారు. నిషేధం విధించిన గుట్కాలు, పాన్ మసాలను విక్రయించడం నేరం. వీటిని రహస్యంగా విక్రయించే దుకాణాలపై పోలీసులు దాడులు చేస్తే బయటపడే అవకాశం ఉంది.

● కావలిలో

# వస్త్ర వ్యాపారుల బంద్ సంపూర్ణం!

వస్త్ర వ్యాపారంపై రాష్ట్రప్రభుత్వం విధించిన విలువ ఆధారిత పన్నును (వ్యాట్) రద్దు చేయాలని కావలి వస్త్ర వ్యాపారుల సంఘం అధ్యక్షుడు తటపర్తి వాసు డిమాండ్ చేశారు. రాష్ట్రప్రభుత్వ విధానాన్ని నిరసిస్తూ కావలి పట్టణంలో వస్త్ర వ్యాపారులు బంద్ నిర్వహించారు. గాంధీ విగ్రహానికి, పొట్టిశ్రీరాములు విగ్రహానికి పూలమాలలు వేసి అనంతరం పట్టణంలో నిరసన ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా



బంద్ సందర్భంగా వస్త్ర వ్యాపారుల ప్రదర్శన.

వాసు మాట్లాడుతూ దేశంలో ఎక్కడా లేని విధంగా వస్త్రాలపై విలువ ఆధారిత పన్నును రాష్ట్రప్రభుత్వం విధించడం దారుణమన్నారు. దీని వలన వ్యాపారులపై తీవ్ర ప్రభావం పడుతుందన్నారు. వెంటనే దీనిని రద్దు చేయాలని డిమాండ్ చేశారు. అనంతరం పట్టణంలో పర్యటిస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డికి, ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావుకు వినతి పత్రం అందజేశారు. బంద్ సందర్భంగా పట్టణంలో వస్త్ర వ్యాపారంలో పేరుగాంచిన అన్నపూర్ణ, శుభోదయ, నవోదయ, అరుణోదయ తదితర షాపులు మూతపడడంతో లక్షల రూపాయల మేర ఆర్థిక లావాదేవీలు నిలచిపోయాయి.

# భూదేవమ్మ దాతృత్వం!



విద్యార్థులకు ప్రోత్సాహకాలు అందిస్తున్న వేదికపై భూదేవమ్మ, నేదురుమల్లి పద్మనాభరెడ్డి.

విద్యాభివృద్ధికి తనవంతు సహకారం అందిస్తూ, సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ పలువురి మన్ననలు అందుకొంటున్నారు శిరసంబేడు భూదేవమ్మ. ఇప్పటికే సమాజానికి తనవంతు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్న వారు ఇటీవల అందలమాలలో గల ప్రాథమిక పాఠశాలలో చదువుకొనే విద్యార్థులకు యూనిఫారాలు, బూట్లు, బెల్టులు, తదితర వస్తువులను అందజేశారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిధిగా విచ్చేసిన వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ జిల్లా స్టీరింగ్, కమిటీ సభ్యుడు నేదురుమల్లి పద్మనాభరెడ్డి మాట్లాడుతూ కన్నతల్లి లాంటి జన్మభూమిని మరవకుండా దాతృత్వాన్ని చాటుతున్న భూదేవమ్మను ఆయన అభినందించారు. పలువురు ఆమెను ఆదర్శంగా తీసుకొని స్వగ్రామాలను అభివృద్ధి చేయాలన్నారు. దాత భూదేవమ్మ మాట్లాడుతూ గ్రామంలో కళ్యాణ మండపం నిర్మించడంతోపాటు పాఠశాలలో మంచినీటి సౌకర్యాన్ని, సరస్వతి విగ్రహాన్ని ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. అనంతరం పాఠశాల విద్యార్థులు ముప్పై మందికి దుస్తులు ఇతర సామగ్రిని అందజేశారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ సునీల్, మండల విద్యాధికారి బాబు, ప్రధానోపాధ్యాయుడు రాధాకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

# పెంచలకోనలో రెడ్డిజన సేవా సంఘం సేవలు!

● సత్రంలో పెద్ద సంఖ్యలో గదులు, బస చేసిన వారికి ఉచిత భోజన వసతి.

ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన పెంచలకోన లక్ష్మీనరసింహస్వామి దర్శనానికి వచ్చే భక్తులకు భోజన వసతి సౌకర్యాలు ఏర్పాటు చేసి పలువురి మన్ననలు అందుకొంటోంది రెడ్డిజన సేవాసంఘం. 2005లో పెంచలకోనలో 17 గదులతో ఏర్పాటైన ఈ సత్రంలో 2007 నుండి వసతి సౌకర్యాలతోపాటు భోజన సదుపాయాన్ని కల్పిస్తున్నారు. 2011లో 41 రూములతో ఈ సత్రాన్ని అభివృద్ధి పరచి అధిక సంఖ్యలో వచ్చే భక్తు





పెంచలకోనలోని రెడ్డిజన సేవా సంఘం వసతి గృహం.

లకు వసతికి లోటు రాకుండా చూస్తున్నట్లు రెడ్డిజన సంఘం డెవలప్‌మెంట్ కమిటీ ఛైర్మన్, సంఘ కార్యదర్శి అయిన బండి శ్రీనివాసులరెడ్డి తెలిపారు. పెంచలకోనలో వివాహం చేసుకొనే దంపతులకు, వారి బంధువులకు ఉచిత వసతి, భోజన సదుపాయం కల్పిస్తామన్నారు. సంఘ అధ్యక్షుడు శ్యాం సుందర్‌రెడ్డి ఇతర సభ్యుల సహకారంతో భవిష్యత్‌లో మరిన్ని సేవా కార్యక్రమాలు చేపడుతామని తెలిపారు.

# ఉదయగిరిలో నీటి ఎద్దడి!

## అల్లాడుతున్న జనం

ఉదయగిరి నియోజవర్గంలోని పలు మండలాల్లోని గ్రామాల్లో మంచినీటి సమస్య ఎదుర్కొంటున్నారు ప్రజలు. గొంతు తడుపుకొనేందుకు గుక్కెడు నీళ్ల కోసం పడరానిపాట్లు పడుతున్నారు. పాలకులు ఇచ్చే హామీలు నెరవేరకపోవడం, అధికారులు తగిన చర్యలు చేపట్టకపోవడంతో నీటి ఎద్దడిని ఎదుర్కోవాల్సి వస్తోంది. దాదాపు నియోజకవర్గంలోని అన్ని మండలాల్లోను ఇదే పరిస్థితి. గ్రామాల్లో మంచినీటి పథకాలు, చేతి పంపులు వున్నప్పటికీ అవి నిరుపయోగంగా మారడంతో అవి దిష్టిబొమ్మల్లా మారాయి తప్ప ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడడం లేదు. అధికారులు మాత్రం మంచినీటి సమస్య పరిష్కారానికి అన్ని చర్యలు తీసుకొన్నామని, మరమ్మత్తులు చేపట్టామని చెప్తున్నా క్షేత్రస్థాయిలో మాత్రం పరిస్థితులు అందుకు భిన్నంగా వున్నాయి. నియోజకవర్గ కేంద్రమైన ఉదయగిరిలో 557 చేతిపంపులు వుండగా అధికభాగం మరమ్మత్తులకు గురై ఉన్నాయి. అలాగే 50 మంచినీటి పథకాలు వుండగా సగానికి పైగా పథకాలు పని చేయడం లేదు. మరమ్మత్తులకు గురైన వాటిని గుర్తించి బాగు చేసే చర్యలు సంబంధిత అధికారులు చేపట్టకపోవడంతో మండల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. విధిలేని పరిస్థితుల్లో ప్రజలు దాహార్తిని తీర్చుకొనేందుకు మంచినీటి క్యాన్లను కొనుగోలు చేయాల్సి రావడంతో అదనపు భారం మోయాల్సి వస్తోందని వాపోతున్నారు ప్రజలు. ముఖ్యంగా ఉదయగిరి మండలంలో గల గుడినడవ, బండగానిపల్లి, కుర్రపల్లి, బిసి కాలనీ, జి.చెరువు పల్లి, శకునాలపల్లి తదితర గ్రామాల్లో నీటి ఎద్దడి అధికంగా వుంది. ప్రజలు పడుతున్న కష్టాలను గమనించైనా అధికారులు మంచినీటి సమస్య పరిష్కారానికి తగిన చర్యలు చేపట్టాల్సి వుంది.

# మోడల్ హైస్కూల్‌కు రాజకీయ రంగు!

మోడల్ హైస్కూల్ ఏర్పాటు మర్రిపాడు మండలంలో వివాదాస్పదంగా మారింది. పాఠశాల ఏర్పాటులోను రాజకీయాలు చోటుచేసుకోవడంతో ఈ వివాదం రాజకీయ రంగు పులుముకొంది. జిల్లాలో 10 మోడల్ హైస్కూల్ మంజూరు అయ్యాయి. వీటిలో తొమ్మిదింటిని వివిధ మండల కేంద్రాలలో ఏర్పాటు చేశారు. మర్రిపాడు మండలానికి మంజూరైన హైస్కూల్‌ను మేకపాటి సోదరులు దీనిని బ్రాహ్మణపల్లికి తరలించి అక్కడ ఏర్పాటు చేసేందుకు ప్రయత్నించారు. ఈ నేపథ్యంలో ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి దీనికి అడ్డుపడ్డారు. మోడల్ హైస్కూల్‌ను బ్రాహ్మణపల్లిలో కాకుండా నందవరం కూడలిలో ఏర్పాటు చేయాలని భావించి అందుకు భూమి పూజ నిర్వహించారు. దీంతో వివాదం చెలరేగింది. కొందరు దీనిపై కోర్టును ఆశ్రయించి బ్రాహ్మణపల్లిలోనే హైస్కూల్‌ను ఏర్పాటు చేయాలని కోరారు. దీనిపై ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని కోర్టు తహశీల్దార్‌ను ఆదేశించింది. అభిప్రాయ సేకరణ సందర్భంగా వివిధ వర్గాల ప్రజలు, ప్రజాసంఘాలు మోడల్ హైస్కూల్‌ను మండల కేంద్రంలోనే ఏర్పాటు చేయాలనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాయి. కొందరు ఈ ప్రజాభిప్రాయ సేకరణ జరిగే చోటుకు చేరుకొని అడ్డు తగలడంతో రసాభాసగా మారింది. విద్యార్థుల ప్రయోజనాల కోసం ఏర్పాటయ్యే పాఠశాలలోనూ రాజకీయాలు చోటు చేసుకోవడం పట్ల ప్రజలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.



ఉత్తమ నీటి యాజమాన్యానికిగాను రిపబ్లిక్ డే పెరేడ్‌లో కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి చేతుల మీదుగా ప్రశంసా పత్రాన్ని అందుకొంటున్న సోమశిల ప్రాజెక్ట్ కమిటీ ఛైర్మన్ కండ్లగుంట మధుబాబు నాయుడు.

● మెము రైళ్లను

# బిట్రగుంట వరకు పొడిగించండి!

**బిజెపి దళిత మోర్చా కార్యదర్శి వినతి**



సామాన్య ప్రయాణీకులు అధికంగా ప్రయాణించే మెము రైళ్లను బిట్రగుంట వరకు పొడిగించాలని బిజెపి దళిత మోర్చా జిల్లా ప్రధాన కార్యదర్శి ఎకె.జయరాజ్ డిమాండ్ చేశారు. ఈ మేరకు ఆయన రైల్వే అసిస్టెంట్ డివిజన్ ఇంజనీర్ డి.సుందరరాజన్‌ను కలిసి వినతి పత్రం అందజేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ చెన్నై–తిరుపతి నుంచి నెల్లూరు వరకు, విజయవాడ – గుంటూరు నుంచి ఒంగోలు వరకు వస్తున్న మెమురైళ్లను ఇరువైపులా బిట్రగుంట వరకు పొడిగించినట్లయితే వేలాది మంది ప్రజలకు, విద్యార్థులకు, ఉద్యోగ, కార్మికులకు ప్రయాణించేందుకు ఎంతో సౌలభ్యంగా వుంటుందన్నారు. డీజిల్ ధరలు పెరిగి బస్సు ఛార్జీలు సామాన్యులకు భారమైనందున అతితక్కువ ఛార్జీతో నడుస్తున్న మెమురైళ్ల నెల్లూరు–ఒంగోలు మధ్య వున్న ప్రజలకు కూడా అవసరమన్నారు. దీనిపై రైల్వేశాఖ తగిన విధంగా ఆలోచించి ప్రజలకు ఉపయోగపడేలా నిర్ణయం తీసుకోవాలన్నారు. అలాగే కొన్నేళ్లుగా డిమాండ్ చేస్తున్న విధంగా పినాకిని ఎక్స్‌ప్రెస్‌ను బిట్రగుంటలో నిలుపుదల చేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో రైల్వే అభివృద్ధి కమిటీ సభ్యులు మెతుకు రాజేశ్వరి, కళ్యాణ్, యతిరాజులు నాయుడు, జోసఫ్, గౌతమ్, ఆరోగ్యనాధన్, రమణయ్య, రమేష్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

● కావలిలో

# పెచ్చుపెరిగిన అక్రమ నిర్మాణాలు!

**లంచాలు తింటూ ఊరుకొంటున్న అధికారులు**

కావలి పట్టణంలో అనుమతి లేని నిర్మాణాలు యదేచ్ఛగా సాగుతున్నాయి. నిబంధనలకు విరుద్ధంగా బహుళ అంతస్తుల భవనాలు, అపార్టుమెంట్లు, షాపింగ్ కాంప్లెక్స్‌లు నిర్మిస్తున్నా మునిసిపల్ అధికారులు లంచాలు మరిగి ఈ నిర్మాణాలేవి తమకు కనపడనట్లే వ్యవహరిస్తుండడంతో అక్రమ నిర్మాణాలు పెచ్చు పెరిగి పోతున్నాయి. అపార్టుమెంట్లు, ఇతరత్రా బహుళ అంతస్తుల భవనాలు నిర్మించే సమయంలో ప్రభుత్వం నిర్దేశించిన ప్రకారం ఫైర్ ఇంజన్ తిరిగేందుకు తగిన స్థలాన్ని వదిలిపెట్టాలి. పెంట్‌హౌస్ నిర్మించకూడదు. అపార్టుమెంట్ క్రింద ఎలాంటి గదులు నిర్మించరాదనే నిబంధనలు వున్నప్పటికీ ఇవెక్కడా అమలు కావడంలేదు. తమ ఇష్టప్రకారం అక్రమ నిర్మాణాలు చేపడుతున్నా అడిగే నాధుడే లేకుండా పోయాడు. తమ వాటా అందితే చాలు ఎవరు ఎన్ని అంతస్తులు నిర్మిస్తున్నా కన్నెత్తి చూడరట. డబ్బులు అందకపోతేనే యంత్రాలను తీసుకవచ్చి పగులగొడతామని నానా గొడవలు చేస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. పాతవూరు, పుల్లారెడ్డి నగర్, వైకుంఠపురం, జనతాపేట తదితర ప్రాంతాలలో అక్రమ కట్టడాలు కోకొల్లలుగా కన్పిస్తాయి. ఈ దారినే నిత్యం మునిసిపల్ అధికారులు తిరుగుతుంటారు. కానీ ఇవి వారి కంటికి కన్పించవు. అండర్‌గ్రౌండ్ నిర్మాణాలు సైతం పెరిగిపోతున్నాయి. ఈ పరిస్థితుల్లో లంచాల మత్తులో తేలిపోతున్న మునిసిపల్ సిబ్బంది మత్తు వదలకొట్టి సక్రమంగా పని చేసేలా అక్రమ నిర్మాణాలు నిరోధించేలా ఉన్నతాధికారులు జోక్యం చేసుకోవాలని కావలి పట్టణ ప్రజలు కోరుతున్నారు.

# దిగుమతయ్యే నేతలొద్దు!

**● బోగోలులో స్పష్టం చేసిన వైకాపా కార్యకర్తలు**

పార్టీని పటిష్టపరచి ప్రజల ముందుకు తీసుకపోతున్న నాయకులను కాకుండా ఎన్నికల ముందు పార్టీలోకి వచ్చే నాయకులకు పార్టీలో ప్రాధాన్యత ఇవ్వొద్దని, పదవులు పంపకం చేపట్టొద్దని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలు జిల్లాపార్టీ నేతలకు విన్నవించారు. ఇటీవల వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ చేపట్టిన సంతకాల సేకరణ కార్యక్రమం బోగోలు మండలంలో జరిగింది. ఆపార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కావలి నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా వైకాపా మండల నేత మద్దిబోయిన రఘు మాట్లాడుతూ పార్టీ స్థాపించిన తర్వాత ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఆధ్వర్యంలో పార్టీ బలోపేతానికి కృషి చేస్తున్నామన్నారు. అయితే ఇటీవల కొంతకాలంగా కొత్త నేతలు ఎన్నికలకు ముందు దిగుమతి అవుతారన్న ప్రచారం జోరుగా జరుగుతున్నాదని, దీనిపై కార్యకర్తలు అయోమయానికి గురౌతున్నారన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని పార్టీ కోసం అహర్నిశలు పాటుపడే వారికి కాకుండా కొత్తవారికి ఎన్నికలలో, పదవుల పరంగా ఆస్కారం కల్పించొద్దని కోరారు. వైకాపా మండల ఇన్‌చార్జి, మాజీ సర్పంచ్ తూపిలి పెంచలయ్య తదితరులు ఇదే అంశంపై మాట్లాడుతూ పార్టీ ఫిరాయింపుదారుల విషయంలో జాగ్రత్త వహించాలని కోరారు. ఎన్నికల ముందు బడా పారిశ్రామిక వేత్త ఒకరు ఈ ప్రాంతం నుంచి బరిలో దిగనున్నారనే ప్రచారం జరగడంతో కార్యకర్తలు పైవిధంగా స్పందించినట్లు సమాచారం.

● వెంకటగిరిలో

# ఆటోడ్రైవర్లకు పోలీసు హెచ్చరిక!

వెంకటగిరి పట్టణంలో నియమ నిబంధనలను పాటించకుండా తిరిగే ఆటోలపై కఠిన చర్యలు చేపడుతామని స్థానిక సిఐ శ్రీనివాసులరెడ్డి హెచ్చరించారు. ఇటీవల ఆటో కార్మికులతో నిర్వహించిన సమావేశంలో ఆయన పాల్గొని ప్రసంగించారు. పట్టణంలోని వీధులు ఇరుకుగా వున్నందున వాహనాల రాకపోకలపై నియంత్రణ విధించామన్నారు. అసలే ఇరుకుగా వుండే రోడ్లపై ఆటోలు నడిపేవాళ్లు ఇష్టానుసారంగా నిలుపుతుండడం వల్ల ట్రాఫిక్ సమస్య మరింత జటిలంగా మారుతున్నాదన్నారు. నిర్దేశించిన ప్రాంతాల్లో మాత్రమే ఆటోలను నిలపాలని, లేదంటే జరిమానా విధిస్తామన్నారు. నిబంధనలకు విరుద్ధంగా 20మందిని కూడా ఆటోలో ఎక్కించుకొని తిరుగుతున్నారని, అలాంటి వాహనాలను ఉపేక్షించేది లేదన్నారు. పట్టణంలో ట్రాఫిక్ నియంత్రణకు ఆటో కార్మికులు సహకరించాలన్నారు. ఈ కార్యక్రమంలో వెంకటగిరి ఎస్ఐ అన్వర్ బాషా, బాలాయపల్లి ఎస్ఐ మంజీన్ సాహెబ్‌లు మాట్లాడుతూ పట్టణ పరిధిలోనే కాకుండా గ్రామీణ, ప్రధాన రహదారుల్లోనూ విచక్షణా రహితంగా ఆటోలు నడిపితే చర్యలు తప్పవని హెచ్చరించారు. సమావేశంలో పాల్గొన్న ఆటో కార్మిక సంఘాల నేతలు మాట్లాడుతూ పోలీసులకు సహకరించి ట్రాఫిక్ సమస్య ఏర్పడకుండా చూస్తామని హామీ ఇచ్చారు.



● యువత

# సక్రమ మార్గాన నడవాలి!

యువత వ్యసనాలు మాని వ్యక్తిత్వం చాటాలని తోటపల్లి గూడూరు ఎస్ఐ సాంబశివరావు పిలుపునిచ్చారు. ఈదూరు గ్రామంలో సంక్రాంతి పండుగను పురస్కరించుకొని నిర్వహించిన ముగ్గుల పోటీల్లో విజేతలైన వారికి బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమం జరిగింది. దీనికి ముఖ్య అతిధిగా హాజరైన ఎస్ఐ మాట్లాడుతూ దేశాభివృద్ధికి పాటు పడాల్సిన యువత చెడు వ్యసనాలకు లోనై ప్రక్కదారి పడుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. దీనివలన ఆయా కుటుంబాలు చిన్నాభిన్నం అవుతున్నాయని, సమస్యలు తలెత్తుతున్నాయన్నారు. కోడి పందాలు, జూదం కారణంగా ఏకంగా రాజ్యాలకు రాజ్యాలే కూలిపోయాయని చరిత్రాత్మక, పౌరాణిక ఘటనలను ఉదహరించారు. వీటి నుంచి దూరంగా జరిగి సన్మార్గంలో నడవాలని, వృద్ధిలోకి రావాలని యువతకు హితబోధ చేశారు. ముగ్గుల పోటీల్లో విజేతలుగా నిలచిన సింధూర, మీరమ్మ, ప్రేమ కుమారిలకు బహుమతులను అందజేశారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎంపిపి టంగుటూరు శ్రీనివాసులరెడ్డి, మస్తానయ్య, మల్లిఖార్జున్, సురేంద్ర, చిన్న మస్తానయ్య, పెద్ద మస్తానయ్య తదితరులు పాల్గొన్నారు.



న్యూఢిల్లీలోని సైన్స్ ఒలంపియాడ్ ఫౌండేషన్ నిర్వహించిన అంతర్జాతీయ మ్యాథ్స్ ఒలంపియాడ్ పరీక్షలలో ప్రథమురాలిగా నిలచిన నెల్లూరు వేదాయపాళెంలోని డాక్టర్ కిషోర్స్ రత్నం స్కూల్ విద్యార్థిని సాయిఅభిఘ్నను అభినందిస్తున్న రామ్మూర్తినాయుడు.

# విత్తనశుద్ధి కేంద్రాల ఏర్పాటుకు రుణాలు!

విత్తనశుద్ధి కేంద్రాల ఏర్పాటుకు 50శాతం సబ్సీడీపై రుణాలందిస్తున్నట్లు వ్యవసాయశాఖ జెడి కెవిసుబ్బారావు తెలిపారు. వెంకటాచలం మండల కార్యాలయంలో జరిగిన రైతుమిత్ర అవగాహన సదస్సులో ఆయన పాల్గొన్నారు. ఈ సందర్భంగా ప్రభుత్వ పరంగా అందుతున్న వివిధ పథకాలపై అవగాహన కల్పించారు. రైతులు రైతుమిత్ర గ్రూపుల్లో సభ్యులుగా నమోదు కావాలన్నారు. 2005లో రైతు మిత్ర గ్రూపుల ఏర్పాటు జరిగినా ముందుకు సాగలేదన్నారు. ప్రస్తుతం గ్రూపులను పటిష్టపరచేందుకు తగిన చర్యలు చేపడుతున్నామన్నారు. నాబార్డు ద్వారా రైతుమిత్ర గ్రూపు సభ్యులకు విత్తనా శుద్ధి కేంద్రాల ఏర్పాటుకు సబ్సీడీపై ఇస్తున్న రుణ సదుపాయాన్ని వినియోగించుకోవాలన్నారు. అనంతరం రైతులకు సబ్సీడీపై ఇచ్చే స్ప్రేయర్లను పంపిణీ చేశారు. ఈ సదస్సుకు ముందు రైతుల ద్వారా నిర్వహించారు. ఈ కార్యక్రమంలో

**వెంకటాచలంలో వ్యవసాయశాఖ జెడి**

ఆత్మ డిడి భారతి, స్పెషలాఫీసర్ సత్యవాణి, వ్యవసాయశాఖ ఎడి పద్మావతి, మండల వ్యవసాయాధికారి ఇవి.రమణ, ఉద్యానవనశాఖ ఎడిలు దీపిక, ధర్మజ, పట్టుపరిశ్రమలశాఖ ఎడి కుల్లాయిరెడ్డి, ఆదర్శ రైతులు పాల్గొన్నారు.

## వెంకటగిరి ఆర్వీఎం హైస్కూల్
# పూర్వవిద్యార్థుల సమావేశం!



ముప్పై ఏళ్ల క్రిందట చదువుకొన్న వారు తిరిగి ఒకరినొకరు కలుసుకోవడంతో వారి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ఈ ఆత్మీయ కలయిక వెంకటగిరి ఆర్‌విఎం హైస్కూల్‌లో ఇటీవల జరిగింది. 1980–81 సంవత్సరంలో ఆర్‌విఎం హైస్కూల్‌లో పదోతరగతి, స్థానిక విశ్వోదయ కళాశాలలో ఇంటర్ చదివిన విద్యార్థులందరూ కలసి పూర్వవిద్యార్థుల సమ్మేళనం పేరుతో కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా విద్యార్థులుగా వున్న సమయంలో తీపి జ్ఞాపకాలను గుర్తు చేసుకొని, ఒకరికొకరు కుశల ప్రశ్నలతో సందడి చేశారు. కళాశాల విశ్రాంత అధ్యాపకుడు డాక్టర్ బి.సూర్య నారాయణరావు, హైస్కూల్ రిటైర్డ్ టీచర్ వీరమల్లయ్యలను ఘనంగా సన్మానించారు. ప్రతి ఏడాది గురుసత్కార కార్యక్రమం నిర్వహిస్తామని, సేవా కార్యక్రమాలను చేపడుతామని పూర్వ విద్యార్థుల సంఘం కార్యదర్శి కె.రవీంద్రబాబు ఈ సందర్భంగా ప్రకటించారు. సన్మాన గ్రహీతలు సూర్యనారాయణ, వీరమల్లయ్యలు హైస్కూల్, కళాశాల అభివృద్ధి గురించి, విద్యార్థులతో తమకు గల అనుబంధం గురించి మాట్లాడారు. ఉత్తమ ఉపాధ్యాయులుగా ప్రభుత్వం నుంచి అందుకొన్న అవార్డుకంటే ఈ సన్మానమే మిన్న అని సంతోషించారు. అనంతరం పూర్వ విద్యార్థుల సంఘం కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షుడిగా డాక్టర్ జివి.కృష్ణయ్య, ఉపాధ్యక్షుడిగా పి.సుబ్బరత్నారెడ్డి, నిర్వాహణా కార్యదర్శిగా కె.రవీంద్రబాబు, సంయుక్త కార్యదర్శిగా పి.వెంకటేశ్వర్లు, కె.చెంచుకృష్ణయ్య, టి.మోహన్‌రావు, కోశాధికారిగా రమేష్‌బాబును ఎన్నుకొన్నారు. ఈ కార్యక్రమంలో ఆర్‌విఎం హైస్కూల్ ప్రధానోపాధ్యాయుడు సుధాకర్‌రావు, వీరయ్య, చెంచు కృష్ణయ్య, సుబ్బారావు, మస్తానయ్య తదితరులు పాల్గొన్నారు.



# బోగోలు చెరువులకు నీటిని విడుదల చేస్తాం!

**సోమశిల ప్రాజెక్ట్ కమిటీ ఛైర్మన్ మధు**



బోగోలు మండలంలోని చెరువుల క్రింద సాగు చేస్తున్న రైతాంగానికి షెడ్యూల్ ప్రకారం నీటిని విడుదల చేసేందుకు కృషి చేస్తామని సోమశిల ప్రాజెక్టు కమిటీ ఛైర్మన్ కండ్లగుంట మధుబాబునాయుడు తెలిపారు. ఇటీవల మండలానికి చెందిన రైతులు అక్కరాజుకండ్రిగలో నీటి విడుదలపై సమావేశం నిర్వహించారు. రెండు చెరువుల క్రింద మండల పరిధిలో 700 ఎకరాలకుపైగా సాగు చేస్తున్నామని సమావేశానికి హాజరైన మధుబాబు నాయుడుకు తెలిపారు. నీటి సరఫరా జరగకపోవడంతో పంటలు దెబ్బతిని పోయే ప్రమాదం ఏర్పడిందని ఆందోళన వ్యక్తం చేశారు. ఒక్క పంటకు నీటిని అందించి పంటలను కాపాడాలని ఈ సందర్భంగా విన్నవించారు. దీనికి స్పందించిన మధుబాబు మాట్లాడుతూ షెడ్యుల్‌లో నిర్ణయించిన ప్రకారం ముందుగా పంటలు ఎక్కడెక్కడ దెబ్బతిన్నాయో పరిశీలించి వాటికి ప్రాధాన్యం ఇస్తామన్నారు. చెరువులను ప్రత్యక్షంగా పరిశీలించి నీటి విడుదలకు చర్యలు చేపడుతామని రైతులకు హామీ ఇచ్చారు. రైతులు శ్రమదానంతో చెరువులకు వచ్చే కాలువలను బాగు చేసుకోవాలని సూచించారు. ఈ సమావేశంలో అక్కరాజువారి కండ్రిగ చెరువు నీటి సంఘం అధ్యక్షుడు లంకా వెంకటేశ్వర్లు, బొచ్చు కృష్ణయ్య, నాగరాజు, యానాదయ్య, వెంకట్రావు, మల్లి, శీనయ్య, ఎస్ఎస్ యాదవ్, చంద్ర తదితరులు పాల్గొన్నారు.

## కావలి ఆర్‌డిఓ దడబడలు!

గతంలో కావలి పట్టణంలో గ్యాస్ ఏజన్సీలపై ఆకస్మిక దాడులు జరిపి దడబడలు సృష్టించిన ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి మరోమారు పట్టణంలో తనిఖీలు జరిపి అక్రమార్కుల గుండెల్లో వణుకు పుట్టించాడు. ఇటీవల ఆయన ట్రంకురోడ్డు, అరుంధతీయవాడ తదితర ప్రాంతాలలో తనిఖీలు చేశారు. రోడ్డును ఆక్రమించి కట్టిన బంకులను తొలగించాలని మునిసిపల్ సిబ్బందిని ఆదేశించారు. అక్కడ నుంచి ఆర్‌టిసి బస్టాండ్ చేరుకొన్న ఆయన పొంగిపొర్లుతున్న మురుగునీటిని, దుర్గంధం వెదజల్లుతున్న బస్టాండ్ ఆవరణను పరిశీలించి సంబంధిత అధికారులపై ఆగ్రహించారు. గతంలో తనిఖీకి వచ్చినప్పుడు శుభ్రంగా వుంచాలని చేసిన హెచ్చరికలను పెడచెవిన పెట్టడంపై మండిపడ్డారు. బస్టాండ్ ఎదురుగాగల కూల్‌డ్రింక్‌షాపులో మద్యం త్రాగుతుండడాన్ని గమనించి షాపు నిర్వాహకులను తీవ్రంగా మందలించారు. అక్కడ నుంచి ఎక్సైజ్ పోలీసులకు ఫోన్ చేసి పిలిపించి దుకాణం నిర్వాహకులపై చర్యలు చేపట్టాలని ఆదేశించారు. ఆర్‌డిఓ ఆకస్మిక తనిఖీలతో వ్యాపారులకు ముచ్చెమటలు పట్టాయి. ఆర్‌డిఓ తనిఖీల్లో మునిసిపల్ కమిషనర్ నిరంజన్‌రెడ్డి, తహశీల్దార్ తదితరులు పాల్గొన్నారు.

## వెంకటగిరి ఉపాధిహామీ పనుల్లో ప్రగతి!

వెంకటగిరి మండలంలో ఆరుకోట్ల రూపాయలతో ఉపాధి పనులు చేపడుతున్నట్లు డ్వామా ఎపిడి భాస్కర్‌రావు తెలిపారు. ఇటీవల స్థానిక మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన సమీక్షా సమావేశంలో ఆయన పాల్గొన్నారు. ఉపాధిపనులు అడిగిన ప్రతి ఒక్కరికి పని కల్పించేలా చర్యలు చేపట్టామన్నారు. గ్రామస్థాయిలో ఉపాధి పనులు సక్రమంగా జరిగేలా సిబ్బందికి శిక్షణా కార్యక్రమాలు నిర్వహించామన్నారు. ఇందిర జలప్రభ పథకం క్రింద మండలంలో 90 ఎకరాల భూమిని అభివృద్ధి చేస్తున్నామని తెలిపారు.

## కురిచర్లపాడు సహకార సంఘంలో
# రికార్డులు గల్లంతు!

వెంకటాచలం మండలం కురిచెర్లపాడు సహకార సంఘంలో రికార్డులు మాయం కావడంతో కలకలం రేగింది. రికార్డులు గల్లంతు కావడంతోపాటు, నిధులు దుర్వినియోగం జరిగినట్లు పెద్ద ఎత్తున ప్రచారం జరగడంతో మండలంలో చర్చనీయాంశమయ్యింది. 142 మంది సభ్యులున్న సొసైటీలో 80మంది ఓటర్ల పేర్లు లేపోవడంతో వివాదం నెలకొనింది. ఈ సంఘానికి అధ్యక్షునిగా వున్న వ్యక్తి మృతి చెందడంతో కొందరు రికార్డులను దాచారనే ఆరోపణలు వ్యక్తమవుతున్నాయి. గ్రామానికి చెందిన మావిళ్ల రాధాకృష్ణయ్య, రామకృష్ణయ్యలు సమాచారహక్కు చట్టం క్రింద సహకార సంఘం నిధులు, ఓటర్ల వివరాలను అడిగారు. దీనిపై వారికి ఎలాంటి సమాచారం రాలేదట. దీనిపై పలు విమర్శలు, ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి. ఈ విషయమై పలువురు రైతులు అధికారులను కలసి విన్నవించారు. రికార్డులు గల్లంతు కావడంపై విచారణ జరిపించాలని, ఓటర్లుగా వుండి పేర్లు కోల్పోయిన వారికి తిరిగి ఓటు హక్కు కల్పించాలని కోరారు. అధికారుల నుంచి తగిన స్పందన రాకపోతే న్యాయస్థానాన్ని ఆశ్రయించేందుకు సిద్ధమవుతున్నారు.

# మహా కుంభమేళా మహాద్భుతం!

మహా కుంభమేళా మహోధృతంగా మొదలైంది. మకర సంక్రాంతితో మొదలై మహా శివరాత్రితో ముగిసే ఈ మహోన్నత మతపర ఉత్సవాన్ని అర్థం చేసుకోవడం, మాటలలో వర్ణించడం ఎవరి తరమూ కాదు. పదిహేను వందల సంవత్సరాల క్రితం కుంభమేళాను సందర్శించిన చైనా యాత్రీకుడు జియాన్‌జాంగ్ ఎంత సంభ్రమాశ్చర్యాలకు లోనైనాడో ఇప్పుడు దీన్ని అర్థం చేసుకోవడానికి వచ్చిన అమెరికన్ మేనేజ్‌మెంట్ కళాశాల అధ్యాపకులూ అదే అనుభూతికి లోనౌతున్నారు. రెండు వందల ఏళ్ల క్రితం ప్రఖ్యాత ఇంగ్లీషు రచయిత మార్క్ ట్వైన్ "దీన్ని ప్రేమతో చేస్తున్నారో లేదా భయంతో ఆచరిస్తున్నారో నాకైతే తెలియదు. ప్రేరణ ఏదైనా ఇదొక అద్భుతం, వూహకు అందని అనుభూతి, పరమాశ్చర్యకరం, మన బోటి శ్వేతజాతీయులకు ఈ మహత్యం ఎప్పటికీ అర్థం కాదు" అని వ్యాఖ్యానించాడు.



కుంభ మేళా మూలం మన పురాణాలలోని క్షీరసాగర మథనంలో కన్పిస్తున్నది. దూర్వాస మహాముని స్వర్గలోక విహారం చేస్తున్న సమయంలో తనకెదురు పడిన ఇంద్రుడికి ప్రేమ పూర్వకంగా తన మెడలోని పూల హారాన్ని ఇస్తాడు. కానీ ధన గర్వంతో మిడిసిపడే ఇంద్రుడు ఆ మాలను తన ఐరావతం మోపురం మీదకు గిరాటేస్తాడు. ఆ ఏనుగుకు దాని విలువ తెలియక కాళ్లక్రింద వేసి తొక్కి పారేస్తుంది. అది చూసిన దూర్వాసుడు ఆగ్రహించి, నువ్వు నీ స్వర్గలోక వాసులు కటిక దారిద్ర్యంతో అలమటిస్తారని శపిస్తాడు. ఆ శాప ఫలితంగా ఇంద్రుడి భోగాలన్నీ మాయమై, పూటకు ఠికానా లేని పేదవాడిగా మారిపోతాడు. స్వర్గలోక ఐశ్వర్యాలను రాక్షస గణం దక్కించుకొంటుంది. తమకు పట్టిన ఈ దుర్గతి నుంచి విముక్తి ప్రసాదించమని బ్రహ్మను వేడుకొంటారు దేవతలు. బ్రహ్మ ఈశ్వరులు కలిసి శ్రీ మహావిష్ణువుతో సలహా పడుతారు. క్షీర సాగర మథనంతో అమృతాన్ని సృష్టించి సేవిస్తే తప్ప దేవలోకానికి అమర సుఖాలు దక్కవని చెప్తాడు విష్ణు భగవానుడు. అయితే పాల సముద్రాన్ని చిలకడం దేవతలొక్కరి వల్ల వీలు కాదు. వారందరూ కలిసి వెళ్లి రాక్షసులకు మాయ మాటలు చెప్పి సహకారం తీసుకొంటారు. మంథర పర్వతాన్ని కవ్వంగా, వెయ్యి పడగల వాసుకిని త్రాడుగా సముద్ర మథనం జరుగుతుంది. అయితే అందులో పుట్టిన అమృతాన్ని ముందు చెప్పిన

కొరవ 14వ పేజీలో





నెల్లూరులోని నాజ్ జ్యూయలరీ అధినేత లలిత్‌జైన్ కుమారుడు నిఖిల్, ఇష్వితల వివాహ నిశ్చితార్థం సందర్భంగా శుభాకాంక్షలందజేస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి. చిత్రంలో అనితాజైన్, గిరీష్ జైన్, సంజయ్‌జైన్.




నెల్లూరు పొగతోటలోని ప్రభవ స్కూల్‌లో రిపబ్లిక్ డే దినోత్సవం సందర్భంగా నిర్వహించిన ఫ్యాన్సీ డ్రెస్ పోటీల్లో పిల్లలు.



రిపబ్లిక్ డే సందర్భంగా నెల్లూరు విజయమహల్‌గేటు వద్ద గల నేతాజీ పైలెట్ హైస్కూల్‌లో జాతీయ జెండా ఆవిష్కరించి వందనం చేస్తున్న హైస్కూల్ అధినేత సుబ్బారెడ్డి.



చీరాలలోని సహజ సాహితి సంస్థ వారు కార్మికాధికారి రాచపాళెం రఘుకు నెల్లూరు వేమన్న బిరుదును హేతువాది రావిపూడి వెంకట్రావు చేతుల మీదుగా అందిస్తున్న దృశ్యం.

# ప్రేమతత్వాన్ని చాటిచెప్పిన మెహర్‌బాబా!



పండుగలు, ఉత్సవాలు అనేవి సమాజ హితం కోరుతూ, మానవాళి శ్రేయస్సు కోరుతూ జరుపుకొంటుంటాం. సమాజానికి నిర్దేశిత సందేశం ఇవ్వడానికి దినోత్సవాలు జరుపుకొంటే, సంస్కృతి, సాంప్రదాయాలను కాపాడుకొనేందుకు పండుగలు చేస్తాం. ఏది చేసినా, దేనిని ఆచరించినా పరమార్థం ప్రపంచ మానవాళి శ్రేయస్సు కోసం నిర్దేశింపబడినవే అన్నీ. వీటన్నింటిని జరుపుకొంటున్నప్పటికీ మనుషులలో, వారి ఆలోచన విధానంలో మార్పు రావడం, స్వార్థం, అహంభావం నిండడంతో ద్వేషాలు, విద్వేషాలు పెరిగిపోతున్నాయి. శాంతి లోపిస్తోంది. ఇలాంటి వాటికి దూరంగా మనిషి మనిషిలా బ్రతకాలని, స్వార్థాన్ని విడనాడి తోటి మనిషిని ప్రేమించాలని చాటి చెప్పినవాడు అవతార్ మెహర్‌బాబా. తుదిశ్వాస విడచే వరకు మనిషిని పరమాత్మకు దగ్గర చేసేందుకు ప్రయత్నించాడు.

మహారాష్ట్రలోని పూనేలో జన్మించిన మెహర్ బాబా మనిషిలోని స్వార్థమనే రుగ్మతను తరిమి కొట్టేందుకు ఎంతగానో ప్రయత్నించారు. అందులో భాగంగానే అన్ని బంధాలకు, పతనానికి హేతువైన నేను, నాది అనే స్వార్థాన్ని వీడమని ప్రబోధించాడు. నిన్ను నీవు ప్రేమించుకొన్నట్లే సాటి మనిషిని మనిషిగా చూడమని, ప్రేమించమని సందేశం ఇచ్చాడు. ఇతరులలోని లోపాలను ఎత్తి చూపడం, వారిని ద్వేషించడం, దూషించడం కన్నా మనల్ని మనం సంస్కరించుకోవడంలోనే గొప్పతన ముందన్నాడు. మంచి పని చేయడం అంటే ఏదో చేయడం కాదని ఇతరులకు చెడు చేయకపోవడం, ఎదుటివారి గురించి చెడుగా మాట్లాడకపోవడమే మనం చేయగలిగే మంచి పని అని లోకానికి తెలియ పరచాడు. క్షణికాలైన భౌతిక సుఖాల కోసం తపించిపోతూ ధన వ్యామోహంలో పడి కొట్టుకపోతున్నారని అది సుఖాన్ని, సంతోషాన్ని ఇవ్వదని తెలియజెప్పారు. సుఖాల కోసం, భోగాల కోసం, ధనం కోసం తపించిపోతూ సమయాన్ని వృథా చేసుకోక అంతకురెట్టింపుగా పరమాత్మవైపు మనసు పెడితే తప్పకుండా భగవంతుని దర్శనం లభిస్తుందని, పరమాత్మకు దగ్గర కాగలుగుతారని చాటి చెప్పారు. ఆధ్యాత్మికత అనేది మనిషిని పరమోన్నతమైన మార్గానికి తీసుకెళ్లే ఆలంబన కావాలే తప్ప స్వార్థాన్ని, సంకుచిత తత్వాన్ని కల్గించేది కాకూడదని దిశానిర్దేశం చేశారు.

విశ్వాసం, విధేయత, ఫలాపేక్ష లేకపోవడం నిస్వార్థంగా తనకు తాను సమర్పించుకొనే గుణాన్ని అలవరుచుకోవాలని తెలిపారు. అలాంటి వారినే భగవంతుడు మెచ్చుకొంటాడని, వారిపై కృప చూపుతాడని బోధించాడు. ఏదైతే విశ్వసిస్తామో దాన్నే ఆచరించాలని, పరుల మెప్పుపొందాలని, గొప్పతనం ప్రదర్శించాలని ఆర్భాటాలను, అట్టహాసాలను ప్రదర్శించేందుకు ప్రయత్నించరాదన్నారు. అలాంటి వారికి పరమాత్మ ఎప్పుడూ దూరంగానే వుంటాడని ప్రబోధించారు. ప్రతిఒక్కరూ నేను, నాది అనే స్వార్థాన్ని, పటాటోపాన్ని వదలి ప్రేమ తత్వాన్ని అలవరుచుకోవాలని ప్రపంచానికి ప్రేమ సందేశాన్ని ఇచ్చిన వ్యక్తి అవతార్ మెహర్ బాబా. 1894, ఫిబ్రవరి 25న మహారాష్ట్రలో జన్మిం చిన బాబా 1969లో జనవరి 31న లోకాన్ని వీడారు. ఆనాటి నుంచి అహ్మద్‌నగర్ సమీపంలో మొహదాబాద్‌లో వున్న ఆయన సమాధిని భక్తులు దర్శించుకొని ఆయన సందేశాన్ని గుర్తుకు తెచ్చుకొంటూ వున్నారు.



జీవవైవిధ్య సదస్సు

# జీవవైవిధ్య పరిరక్షణ కోసం ఉద్యమించాలి!

## • నెల్లూరులో జరిగిన సదస్సులో తీర్మానం.

మానవ మనుగడ కోసం, జీవ వైవిధ్య పరిరక్షణ కోసం ప్రతిఒక్కరు ఉద్యమించాలని జీవ వైవిధ్య సదస్సులో తీర్మానించారు. జాతీయ పర్యావరణ జాగృతి కార్యక్రమంలో భాగంగా నగరంలోని నవాబుపేట బంగ్లాతోట కమ్యూనిటి హాలులో ఈ సదస్సు జరిగింది. పర్యావరణంలో ప్రధాన అంశాలైనా వాతావరణం, జలావరణం, శిలావరణం మొదలైన వాటితోపాటు జీవావరణం కూడా ప్రకృతిని, అందులోని వనరులను పునరుజ్జీవింప చేయడంలో ప్రధాన పాత్ర పోషిస్తుందని జాతీయ పర్యావరణ పరిశీలకులు పి.జోసెఫ్ అభిప్రాయపడ్డారు. జీవవైవిధ్య సదస్సుకు అతిధిగా హాజరైన ఆయన పలు అంశాలపై మాట్లాడారు.

మొక్కల పెంపకం ద్వారా మానవ మనుగడకు అవసరమైన ఆక్సిజన్ లభిస్తుందన్నారు. అవగాహన లేమితో మొక్కలను నరికివేస్తే మానవ మనుగడ ప్రశ్నార్థకంగా మారే ప్రమాదం వుందన్నారు. గ్రామీణ ప్రాంతాల్లో జీవవైవిధ్య పరిరక్షణకు అవగాహన కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నట్లు ఆయన చెప్పారు. గడిచిన వేలాది సంవత్సరాలుగా జరిగిన పరిణామక్రమం ఫలితంగా ప్రతి ఒక్కరు జీవ వైవిధ్యాన్ని చూస్తున్నారు. మానవులతోపాటు వివిధ రకాల జీవుల మనుగడ ఒకదానితో ఒకటి ముడిపడి వుంటాయి. పరస్పర సహకారంతో ఇవి మనగలుగుతున్నాయి. సూక్ష్మజీవుల నుంచి అతి పెద్ద జంతువుల వరకు జీవచక్రంలో వున్నాయి. వీటిన్నిటి సమూహాన్ని జీవావరణంగా వ్యవహరించడం జరుగుతుందని ఆయన వివరించారు.

### ప్రకృతి వనరులకు వెలకట్టలేం!

జీవ వైవిధ్యం ద్వారా మనం ప్రకృతి నుండి పొందుతున్న వనరులకు, సేవలకు, వస్తువులకు ఎప్పటికీ విలువ కట్టలేం. దురదృష్టవశాత్తు ప్రకృతి వనరులను ఇతర జీవుల కంటే అత్యధికంగా వినియోగించుకుంటున్న మానవుల చర్యల కారణంగా సాధారణ స్థితి కంటే వెయ్యిరెట్లుగా జీవ వైవిధ్య విచ్ఛిన్నమవుతోంది. ఈ పరిస్థితి ఇలా కొనసాగితే భావితరాల మనుగడ అత్యంతంగా దెబ్బతినే ప్రమాదం కూడా వుందని పర్యావరణ శాస్త్రవేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. జలసంపద, అటవీ సంపద, ఇతర ప్రకృతి వనరులను విచక్షణ రహితంగా దోపిడి జరుగుతోంది. ప్రమాదకరమైన విధానాల ద్వారా నేల నిర్వీర్యం కాబడుతోంది.

ప్రకృతిలోని భిన్న ప్రదేశాలు వాటిలోని చరాచర జీవులు, వాటి సహజ స్థితి, ఆహారపు అలవాట్లు సంయోగ వియోగాలు వాటి పునరుత్పత్తుల ఫలితంగా భూమి అందరి అవసరాలు తీర్చగలుగుతోందని సదస్సులో పాల్గొన్న లక్ష్మి అరుంధతీయ మహిళా సంఘం అధ్యక్షురాలు ఆర్. అమరావతి అన్నారు. ఆహారం, ఆరోగ్యం, ఆర్థిక వ్యవస్థ, జీవనశైలి కేవలం ప్రకృతి వనరుల లభ్యతపైనే ఆధారపడి వుందని చెప్పారు. ఇవి ఏమాత్రం తగ్గిపోయినా, అంతరించినా, మానవాళికి ఏర్పడే ప్రమాదాలను భర్తీ చేయలేమని ఆవేదన వ్యక్తం చేశారు. జంతువులు, అడవులు అంతరిస్తే భూమి తన సహజ స్వరూపాన్ని కోల్పోయి ఏర్పడే దుష్ట పరిణామాలను ఊహించుకుంటే భయాందోళన కలుగుతుందన్నారు. జీవ వైవిధ్య పరిరక్షణకు పెద్దపీట వేసి అందరు కృషి చేయాలని కోరారు.



జీవ వైవిధ్య పరిరక్షణ సదస్సులో మాట్లాడుతున్న పర్యావరణ శాస్త్రవేత్త జోసెఫ్.

ఈ సదస్సుకు ముందు బంగ్లాతోటలో పర్యావరణ పరిరక్షణ కోసం అందరు కృషి చేయాలంటూ ప్లే కార్డులు చేతపట్టి ప్రదర్శన నిర్వహించారు. అనంతరం దాదాపు మూడువందల మొక్కలను నాటారు. ఈ కార్యక్రమంలో విశ్రాంత తహశీల్దార్ చంద్రశేఖర్, ఎ.పోలయ్య తదితరులు పాల్గొని మాట్లాడారు.

**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

తలపెట్టిన పనులలో అప్రయత్న కార్యసిద్ధి. ముఖ్య విషయాలలో పెద్దల లేదా ముఖ్యుల సలహాలు సేకరించి పనులు పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాల వారికి గుర్తింపు లభిస్తుంది. చాలాకాలంగా వున్న స్థిరాస్తి వివాదాలు కొలిక్కి వస్తాయి. అన్ని రంగాల వారికి ఆర్థిక లావాదేవీలు ఆశాజనకంగా వుంటాయి. విద్యార్థులకు తమ విద్యా వికాసాలు ఆనందాన్నిస్తాయి. వ్యవసాయదారులకు కలిసొచ్చే కాలం.

**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

పనులలో పురోభివృద్ధి సాధిస్తారు. నూతన స్థిరాస్తులను కొనుగోలు చేస్తారు. కోర్టు వ్యవహారాలలో తుది నిర్ణయం తీసుకొంటారు. ఆకస్మిక ప్రయాణాలుంటాయి. ఇంట్లో శుభకార్యాలకు డబ్బు ఖర్చు చేస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి మిశ్రమ ఆర్థికాదాయం వుంటుంది. ఖర్చులు అదుపులో వుంచాలి. వ్యవసాయదారులకు చేస్తున్న పనులలో ఆటంకాలు రావచ్చు.

**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఈ వారం మిశ్రమ ఫలితాలుంటాయి. పనులలో అధికంగా జాప్యం జరుగడం లేదా వాయిదా పడడం వుంటుంది. కుటుంబంలో స్వల్ప వివాదాలు మనస్సును బాధిస్తాయి. నిరుద్యోగులకు ఆటంకాలు. విద్యార్థులకు అనారోగ్య సమస్యలు. వ్యవసాయదారులకు పనులలో ఆటంకాలుంటాయి. కళా, క్రీడా రంగాల వారికి కొన్ని ప్రయత్నాలు అనుకూలిస్తాయి. తమ వాక్చాతుర్యంతో విజయం సాధిస్తారు.

**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

గ్రహానుకూలతల వల్ల తలపెట్టిన పనులు సమయానికి పూర్తిచేస్తారు. ఆరోగ్యం నిలకడగా వుంటుంది. వృత్తి, వ్యాపారాలలోని వారు ఆర్థిక ప్రణాళికలు అమలు చేస్తారు. కొన్ని కీలక విషయాలలో స్వతంత్ర నిర్ణయాలు విజయాన్నిస్తాయి. విద్యార్థులు తమ స్వశక్తిమీద ఆధార పడడం మేలు. ఇంట్లోకి కావలసిన వస్తు, వాహనాలు కొనుగోలు చేస్తారు. గృహనిర్మాణాది పనులు అనుకూలిస్తాయి.

**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

నూతన కార్యక్రమాలకు శ్రీకారం చుడతారు. బంధుమిత్రులతో విందు, వినోదాలలో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాభివృద్ధి కనపడుతుంది. భవిష్యత్ ప్రణాళికల మీద దృష్టి పెడతారు. విద్యార్థులు అనుకూల ఫలితాలు సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి భవిష్యత్ ప్రణాళికలు ప్రోత్సాహకరంగా వుంటాయి. వ్యవసాయ పనులు ఆటంకాలు లేకుండా పూర్తి చేస్తారు.

**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

పనులు సకాలంలో పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపార, ఆర్థిక లావాదేవీలు ఉత్సాహంగా సాగుతాయి. నూతన కార్యక్రమాలకు చేసే ఆలోచనలు అనుకూలిస్తాయి. విద్యార్థుల ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. వ్యవసాయ పనులలో పురోగతి వుంటుంది. కళా, క్రీడా రంగాల వారికి పనులలో ఆటంకాలు. కొన్ని విషయాలు బాధిస్తాయి. రాజకీయులు తమ పనులపై శ్రద్ధ కలిగి పనితీరు మెరుగుపరచుకోవాలి.

# వారఫలాలు

*తేది 2-2-2013 నుండి 8-2-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; మకరంలో రవి, శుక్రులు, 3తేది వరకు బుధుడు తదుపరి కుంభంలో; కుంభంలో కుజుడు; కన్య, తుల, వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

6తేది ధనిష్ట కార్తె, షట్‌తివైకాదశి.
8తేది మాసశివరాత్రి.

### శుభ ముహూర్తాలు

వ్యవసాయ, అన్నప్రాసన, ఊయల, సీమంతాది సాధారణ కార్యక్రమాలకు ముహూర్తాలున్నాయి. శంఖుస్థాపన, వివాహాది శుభ కార్యక్రమాలకు శుభముహూర్తాలు లేవు.

**జనవరి తిథులు**
**పుష్య శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 2 | శని | షష్టి | ప | 09.32 గం.ల.వ |
| 3 | ఆది | సప్తమి | ప | 08.12 గం.ల.వ |
| | | అష్టమి | తె | 06.33 గం.ల.వ |
| 4 | సోమ | నవమి | తె | 04.32 గం.ల.వ |
| 5 | మంగళ | దశమి | రా | 02.10 గం.ల.వ |
| 6 | బుధ | ఏకాదశి | రా | 11.35 గం.ల.వ |
| 7 | గురు | ద్వాదశి | రా | 08.50 గం.ల.వ |
| 8 | శుక్ర | త్రయోదశి | సా | 06.01 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

పనులలో ఆటంకాలున్నా సాధిస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాల్లో కీలక సమస్యలను మీ బుద్ధిబలం సహకారంతో అధిగమిస్తారు. ఆర్థిక పురోభివృద్ధి వుంటుంది. శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. కుటుంబ సభ్యులలో ఆనందాలు నింపుతుంది. రాజకీయులకు పై అధికారులతో భేదాలు, విద్యార్థులకు కీలక విద్యలలో విజయం, వ్యవసాయదారులకు పనులు సానుకూలం వుంటాయి.

**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

గతంలో కన్నా మేలుగా వుంటుంది. పనులన్నీ సకాలంలో పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి గతంలో కన్నా మెరుగ్గా వుంటుంది. నూతన వస్తు, వాహన సామగ్రిని కొనుగోలు చేస్తారు. శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకున్న ప్రతికూలతలను అనుకూలంగా మలుచుకొంటారు. వ్యవసాయదారులకు ఆర్థిక పుష్టి. కళా, క్రీడా రంగాల వారి ప్రతిభను అందరూ గుర్తిస్తారు.

**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పనులు సంతృప్తికరంగా వుంటాయి. ఆర్థిక వ్యవహారాలలో పురోభివృద్ధి సాధిస్తారు. దీర్ఘకాలికంగా వున్న కొన్ని సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. చిన్ననాటి మిత్రులను కలుసుకొంటారు. నిరుద్యోగులకు అనుకూలతలుంటాయి. విద్యార్థులు చేపట్టే పనులలో ఇతరుల సహకారం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి ఆటంకాలు తప్పకపోవచ్చు. వ్యవసాయాభివృద్ధి వుంటుంది.

**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఇంట్లో శుభకార్య యత్నాలు, అవసరానికి డబ్బు చేతికందుతుంది. తలపెట్టిన పనులలో ఇతరుల సహకారం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు అదుపులో వుంచాలి. వృత్తి, ఉద్యోగాలలో ఆటంకాలు. ప్రయాణాలలో శ్రమ, లేదా వాయిదాపడటం వుంటుంది. విద్యార్థులకు ఒత్తిడులు పెరగవచ్చు. వ్యవసాయదారులకు అనుకోని సమస్యలు, ఆటంకాలు వుంటాయి.

**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పనులలో ఆటంకాలున్నా బాధించవు. దూరశ్రవణ వార్తలు ఆనందాన్నిస్తాయి. తోబుట్టువుల ఆరోగ్య సమస్యలు బాధిస్తాయి. వస్తు, వాహన సామగ్రి సమకూర్చుకొంటారు. ఇంట్లో శుభకార్య యత్నాలకు కుటుంబ సభ్యుల సహకారం వుంటుంది. విద్యార్థులకు తమ తోటి విద్యార్థులతో వివాదాలు పరిష్కారమౌతాయి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థిక లాభాలు. రాజకీయులు ఆచితూచి నిర్ణయాలు తీసుకోవాలి.

**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఆర్థికాదాయాలు సామాన్య ఫలితాలిస్తాయి. గతంలో చేసిన రుణ బాధలు తొలగుతాయి. ఒక ముఖ్య సమాచారం ఆనందాన్నిస్తుంది. నిరుద్యోగులకు నూతన ఉద్యోగావకాశాలు. ఆకస్మిక ధనలాభం. వృత్తి, వ్యాపారాలలో అభివృద్ధి సాధిస్తారు. విద్యార్థులు ఆశించిన పురోభివృద్ధి సాధించలేరు. కళా, క్రీడా రంగాల వారికి సహచరులతో జాగ్రత్తలు అవసరం.

# చతుర్విధ సూర్య సంక్రమణ రీతులు చెప్పిన ధర్మ సింధు సూక్తం!

*డాక్టర్ డి.విష్ణుశర్మ — సికింద్రాబాద్*

** సంక్రమణం, మానం గురించి చెప్పండి? సంక్రమణం ఎన్ని విధాలు?*

శాస్త్ర కోవిదులకు నమస్కారాలు. సూర్యుడు రాశుల్లో ప్రవేశించడం సంక్రమణం. సూర్య గమనం సౌరమానం, చంద్ర గమనం చంద్రమానం. వృషభాది కుంభ రాశి ప్రవేశం విష్ణుపదం, మిథునాధి మీన ప్రవేశం 'షడతీతి', మేష తుల విషువం, కర్కాటక మకరం ఆయనాలని 'ధర్మసింధు' సూక్తం!

*సి.పార్వతి — చెరువుక్రిందపల్లె*

** పల్లెటూళ్లలో దూలాల యిళ్ల విషయంలో నా అనుమానాన్ని తీర్చండి?*

గర్భ గృహం నుంచి లోపలికి ప్రవేశించే చోట, అడ్డముగా దూలం ఉండకూడదు. అక్కడ సింహద్వారాన్ని ఏర్పాటు చేయకూడదు.

*డాక్టర్ ఎమ్.తనూజ — రాయచూరు*

** వాస్తులో దండం అంటే ఎంత? 'యవ' అంటే ఏమిటి?*

దండం అంటే గజము. 'యవ' అనునది ప్రాచీన కొలత 1/8 అంగుళానికి సమానం (0.317 సెంటీ మీటరు).

*ఎన్.డి.కె — తిరుపతి*

** ఆయన అడవిలో చెట్లు కొడుతుంటారు. పక్షవాతం రావడం యిది మూడోసారి.*

వృక్షవేధ(శాపం) గురించి మీరు వినలేదా? వృత్తిని వదిలేయడం మంచిది. వృక్ష శాపం, ప్రాణాంతకమని నేను నిశ్చయంగా చెప్పగలను.

*డాక్టర్ అనూష — చెన్నై*

** మందులు చేయని పని పూజావిధానం చేసింది. కృతజ్ఞతలు.*

భగవంతుని శక్తికి మించినవి ప్రపంచంలో ఏమీలేవని మీరు నమ్మారు. నమ్మకమే మీ శ్రీవారిని రక్షించింది. భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పండి.

*డాక్టర్ వాగ్దేవి — చెన్నై*

** సూర్యుడు రాశుల్లో ప్రవేశించడం మీకు తెలుసా?*

కాశీ విద్యాపీఠ్‌లో పెద్దల సాంగత్యం వల్ల, మహిరగుల ఖగోళ శాస్త్ర సంస్కృత గ్రంథం వల్ల కొంత తెలుసుకున్నాను. వృషభ రాశి నుంచి కుంభరాశిలోకి సూర్య ప్రవేశాన్ని విష్ణుపదం అంటారని మీలాంటి జ్ఞానులు చెబితే తెలుసుకున్నాను.

*డాక్టర్ ప్రేమ్‌సాయి — చెన్నై*

** ప్రాచీన గ్రంధాలు కులాలను బట్టి సూత్రాల్ని ఎందుకు నిర్ధారించాయి?*

అప్పటి కాలమానాల ప్రకారం ఆర్యుల కాలంలో వర్ణాశ్రమ ధర్మాలు అమలయ్యాక ఈ సూత్రవిభజన జరిగింది. అయితే విశ్వామిత్ర మహర్షి వీటిని ఖండించారు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ సురేష్‌కుమార్ — కర్నూలు*

** బౌద్ధ నిర్మాణాలను గురించి మీరు చెప్పగలరా?*

ఆగమ, వాస్తు శాస్త్రాలు రెండింటిలోనూ ఈ అంశాలు ఉన్నాయి. చిత్రావళి(శిఖరం), అందం (అర్ధవృత్తం), వేదిక, మెట్లు ఇందులోని ప్రధాన భాగాలు.

*ఎ.సి.శ్రీధరశర్మ — తిరుపతి*

** తిరుమలలో 'బంగారు బావి' శాస్త్ర సమ్మతమేనా?*

ఆగమం దక్షిణ భాగంలో ఈ నిర్మాణాన్ని అంగీకరించదు. ఇక శాసన విభాగంలోని 'అప్పం' క్రీశ 1456 దేవరాయల కాలం నాటిది. బియ్యం, నెయ్యి, బెల్లం, మిరియాలు, జీలకర్ర, కొబ్బరి ఇందులోని ప్రధాన వస్తువులు.

*కె.రమణమూర్తి — పెనుకొండ*

** కుటుంబ సమస్యల నివారణకు వాస్తు ఒక్కటే సరిపోతుందా?*

వాస్తు జ్యోతిష్యాలను బేరీజువేస్తే గానీ సమస్యలో స్పష్టత లభించదు. అందువల్ల మీరు రెండూ తెలిసిన శాస్త్రవేత్తను కలవడం మంచిది.

*డాక్టర్ పి.దశయ్య — బెంగుళూరు*

** మంచి ముహూర్తాలలోనే కదా వివాహాలు జరిగేది. మరి ఎందువల్ల విఫలమవుతున్నాయి?*

లబ్ధప్రతిష్టులు పెట్టిన ముహూర్తాలలో వైఫల్యం శాతం తక్కువ. అయినా విధిని తప్పించలేమని ముహూర్త మార్తాండం చెబుతోంది.

## • కల్లూరుపల్లి

# ప్రభుత్వ స్థలంలో అక్రమ నిర్మాణాలు!

**నగరానికి 15 కిలోమీటర్ల పరిధిలో ఉన్న ప్రభుత్వ ఖాళీ స్థలాలను ఎవరికీ కేటాయించరాదన్న ఆదేశాలున్నాయి. కానీ దీనికి భిన్నంగా కల్లూరుపల్లి హౌసింగ్ బోర్డు కాలనీలోని ప్రభుత్వ స్థలంలో గ్రామ రెవిన్యూ అధికారి, మాజీ సర్పంచ్‌లు కలసి ఇళ్లు నిర్మించి అమ్మకానికి పెట్టారు.**

నెల్లూరు నగరానికి 15 కిలోమీటర్ల పరిధిలో ఉన్న ప్రభుత్వానికి చెందిన ఖాళీ స్థలాలను ఎవరికీ కేటాయించరాదన్న ఆదేశాలున్నాయి. ఈ ఆదేశాలకు భిన్నంగా నగరంతోపాటు శివారు ప్రాంతాల్లో ఖాళీ స్థలాలను రాజకీయ పలుకుబడి కలిగిన వ్యక్తులు ఆక్రమించుకుంటున్నారు. రాత్రికి రాత్రే నిర్మాణాలు చేపడుతున్నారు. వీటిని అడ్డుకునేందుకు అధికారులు వెనుకంజ వేస్తున్నారు. అదే సామాన్య ప్రజలు జానెడు స్థలంలో చిన్న గూడు నిర్మించుకుంటే ఆఘమేఘాల మీద వెళ్లి వాటిని వెంటనే తొలగించడంతోపాటు అవసరమైతే పోలీసులకు ఫిర్యాదు కూడా చేస్తుంటారు. పేదవాళ్లకు ఒక న్యాయం, రాజకీయ పలుకుబడి కలిగిన వారికి ఒక న్యాయం అందుతోంది. ప్రభుత్వ ఖాళీ స్థలాల్లో బహిరంగంగానే ఇళ్ల నిర్మాణం జరుపుతున్నా ఒక్కరు కూడా వీటిని ప్రశ్నించలేక పోతున్నారు.

అధికారుల నిర్లక్ష్యానికి ఉదాహరణగా నెల్లూరు రూరల్ పరిధిలోని కల్లూరుపల్లి హౌసింగ్ బోర్డు కాలనీలో జరుగుతున్న అక్రమ నిర్మాణాలను పేర్కొనవచ్చు. పేద ప్రజల పేరుతో బినామీలుగా ఇద్దరు వ్యక్తులు ఖాళీ స్థలంలో ఇళ్ల నిర్మాణాలు చేపట్టారు. వారిలో ఒకరు మాజీ గ్రామ సర్పంచ్ కాగా, మరొకరు గ్రామ రెవిన్యూ అధికారి ఉన్నట్లు స్థానికులు చెబుతున్నారు. రైల్వేట్రాక్‌కు తూర్పువైపున కొంత ఖాళీ స్థలం ఉంది. ఈ స్థలంపై కన్నేసిన ఇద్దరు వ్యక్తులు ఎలాగైనా దానిని చేజిక్కించుకోవాలని పథకం రచించారు. రెవిన్యూ అధికారులను ఏదో ఒక విధంగా ఒప్పించి ఎత్తు పల్లాలుగా ఉన్న స్థలాన్ని చదును చేయించారు. ఆ తర్వాత ఇళ్ల నిర్మాణానికి శ్రీకారం చుట్టారు. ప్రస్తుతం ఐదు ఇళ్లు పూర్తిచేసే దశకు చేరగా, మరికొన్ని ఇళ్లు నిర్మాణ దశలో ఉన్నాయి.

అయ్యప్పగుడి నుంచి హౌసింగ్ బోర్డు కాలనీకి వెళ్లే రహదారికి ప్రక్కనే ఇళ్ల నిర్మాణం జరుగుతున్నది. స్థలం ఆక్రమించిన వారిలో ఒకరు మాజీ సర్పంచ్, మరొకరు గ్రామ రెవిన్యూ అధికారి ఉండడంతో గ్రామంలో ఎవరు కూడా ప్రశ్నించలేని పరిస్థితి. అధికార, రాజకీయ పలుకుబడి కలిగిన వ్యక్తులు కావడం వలన భవిష్యత్తులో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుందన్న భయంతో చూస్తుండి పోవాల్సి వస్తుందని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. కోట్ల రూపాయల విలువ చేసే ప్రభుత్వ స్థలాలు పలుకుబడి కలిగిన వ్యక్తులు ఆక్రమించి సొమ్ము చేసుకొంటున్నా ఉన్నతాధికారుల్లో ఏమాత్రం స్పందన కానరావడం లేదు. ప్రధానంగా తహశీల్దార్ కార్యాలయం సిబ్బంది పరోక్షంగా ఆక్రమణ దారులకు సహకారం అందిస్తున్నారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి.

బడుగు, బలహీన వర్గాలకు చెందిన వారే ఇక్కడ ఇళ్లు నిర్మించుకుంటున్నారని చెబుతున్నారు. వాస్తవానికి పేద ప్రజల పేరుతో బినామీలుగా ఇళ్లు నిర్మించి అనంతరం వాటిని అధిక ధరలకు విక్రయించాలన్నదే వీరి ఉద్దేశం. ప్రభుత్వ స్థలాలను ముందుగా గుర్తించి వాటి పరిరక్షణకు చర్యలు తీసుకోవాల్సిన సంబంధిత శాఖ అధికారులు ప్రభుత్వ ఆదేశాలను గాలికొదిలేస్తున్నారు. రాజకీయ, అధికార పలుకుబడి కలిగిన వ్యక్తుల జోలికెళితే జరగబోయే పరిణామాలు ఎలా ఉంటాయో వీరికి తెలుసు. అందువల్ల ఆక్రమణల గురించి ఫిర్యాదులు అందినా వాటి గురించి పట్టించుకోరు. కల్లూరుపల్లి హౌసింగ్ బోర్డు కాలనీలో ఇళ్లులేని వారు అనేక మంది ఉన్నారు. ప్రభుత్వ ఖాళీ స్థలాలను గతంలో ఆక్రమించి గుడిసెలు వేస్తే తొలగించిన విషయం అందరికీ తెలిసిందే.

ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి ప్రభుత్వ స్థలంలో నిర్మించిన ఇళ్లను తొలగించి వాటిని పేద ప్రజలకు కేటాయిస్తే బాగుంటుంది. అలాగే ప్రభుత్వ స్థలాలను ఆక్రమించి ఇళ్లు నిర్మిస్తున్న గ్రామ మాజీ సర్పంచ్, వీఆర్వోలపై శాఖాపరమైన చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.



వాళ్లు ముగ్గురు...

## • సాంఘిక సంక్షేమ శాఖలో...

# త్రిమూర్తులు చెప్పిందే శాసనం!

**జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ కార్యాలయంలో ముగ్గురు ఉద్యోగులు చక్రం తిప్పుతుంటారు. పేరుకు డిప్యూటీ డైరక్టర్ ఉన్నా ఈ ముగ్గురు ఉద్యోగులు చెప్పినట్లే పనులు జరుగుతాయి. వీరి వ్యవహారశైలి వల్ల ఈ శాఖ గబ్బుపట్టి పోతోంది.**

జిల్లా సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో త్రిమూర్తులుగా పేరొందిన ముగ్గురు ఉద్యోగులు చక్రం త్రిప్పుతున్నారు. ఈశాఖకు జిల్లాస్థాయి అధికారి వున్నా కూడా మొత్తం కార్యాలయ వ్యవహారాలను వీరే చక్కబెడుతుంటారు. కార్యాలయంలో ఏ పని కావాలన్నా వీరిని సంప్రదించాల్సి వుంటుంది. డిప్యూటి డైరెక్టర్ వీరు చెప్పిన విధంగానే నడుచుకుంటారన్న ప్రచారం వుంది. సంవత్సరాల తరబడి ఇదే కార్యాలయంలో తిష్టవేసి విధులు నిర్వహిస్తున్న వీరిని త్రిమూర్తులుగా పిలుస్తుంటారు. కార్యాలయానికి ఇష్టం వచ్చినప్పుడు వస్తుంటారు. వీరికి స్కాలర్‌షిప్పుల దరఖాస్తుల పరిశీలనచేసే పనులు అప్పగించడంతో మరింత దూకుడుగా వ్యవహరిస్తుపోతున్నారు. స్కాలర్‌షిప్పు దరఖాస్తు చేసుకొనేందుకు ఆన్‌లైన్ విధానం ప్రవేశపెట్టక ముందు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ కార్పొరేట్ కళాశాలలకు అనుకూలంగా వ్యవహరించేవారన్న ఆరోపణలు వున్నాయి.

ఆన్‌లైన్ విధానం ప్రవేశపెట్టిన తర్వాత వీరి అక్రమ సంపాదనకు కొంత కళ్లెం పడిందని చెప్పవచ్చు. ఈ ముగ్గురు ఉద్యోగులకు కావలి, గూడూరు, నెల్లూరు రెవెన్యూ డివిజన్లలో స్కాలర్ షిప్పులకు సంబంధించిన పనులు చూస్తుంటారు. స్కాలర్‌షిప్పుల కోసం దరఖాస్తు చేసుకున్న వారికి విద్యా సంవత్సరం ముగిసినా కూడా నిధులు మంజూరు కావడం లేదు. కళాశాల సిబ్బందిని అడిగితే సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో సంప్రదించాలని సలహా ఇచ్చి పంపుతుంటారు. నగరానికి వచ్చి ఆశాఖలోని త్రిమూర్తులను కలిస్తే బ్యాంకు ఖాతాకు సంబంధించిన స్టేట్‌మెంట్, ఆన్‌లైన్ దరఖాస్తు ఏ స్థాయిలో వుందో తెలిపే ధృవపత్రం, విద్యార్థి అభ్యర్థన తీసుకురమ్మని చెప్పి తిరిగి పంపిస్తుంటారు. దూర ప్రాంతాల్లోని కళాశాలలో చదివే విద్యార్థులు ఈ కార్యాలయం చుట్టూ తిరగలేక నానా అవస్థలు పడుతున్నారు.

దరఖాస్తు చేసినప్పుడు అందులో నమోదు చేసిన పూర్తి సమాచారాన్ని పరిశీలించకుండా ప్రభుత్వానికి పంపడం వల్ల ఇబ్బందులు తలెత్తుతున్నాయి. విద్యార్థి బ్యాంకు ఖాతా నెంబర్, తల్లిదండ్రుల వివరాలు, పుట్టిన తేదీలను పరిశీలించాల్సి వుంటుంది. విద్యా సంవత్సరం పూర్తయిన కూడా ఉపకార వేతనం బ్యాంకు ఖాతాలో జమ కాకపోవడంతో అధికారుల చుట్టూ తిరగాల్సి వస్తుంది. సాంఘిక సంక్షేమ శాఖ కార్యాలయంలో మళ్లీ అన్ని వివరాలు సమర్పిస్తే వాటిని భద్రం చేయకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వ కళాశాలలు, ఎయిడెడ్ కళాశాల నుంచి వస్తున్న విద్యార్థుల గురించి పట్టించుకోకుండా కార్పొరేట్ కళాశాలల వారికే అధిక ప్రాధాన్యతనిస్తుంటారన్న ఆరోపణలు వున్నాయి.

ఆన్‌లైన్‌లో వున్న దరఖాస్తును పరిశీలిస్తే నగదు బ్యాంకు ఖాతాలో జమకాబడినట్లు చూపుతుంది. వాస్తవంగా బ్యాంకులో నగదు జమ కాదు. ఇలా ఎందుకు జరిగిందని సంబంధిత ఉద్యోగులను ప్రశ్నిస్తే అస్పష్టంగా సమాధానం వస్తుంది. 2010–11, 2011–12 ఆర్థిక సంవత్సరాలకు సంబంధించి ఉపకార వేతనాలు అందని వారు అనేకమంది వున్నారు. వీరిలో కొందరు కళాశాలలో చదవు మానేసిన వారు వున్నారు. సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయం చుట్టూ తిరగలేక విసుగుచెంది ఉపకార వేతనాన్ని వదులుకుంటున్నారు. సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో స్కాలర్‌షిప్పు విభాగంలో విధులు నిర్వహిస్తున్న త్రిమూర్తులను పని విధానంపై పర్యవేక్షించే వారు కరువయ్యారు.

ఈ ముగ్గురిలో ఒకరికి నగరంలోని కో–ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు షాపింగ్ కాంప్లెక్స్‌లో ఇంటర్‌నెట్ సెంటర్ వుంది. ఆన్‌లైన్‌లో దరఖాస్తు చేసుకునేందుకు కళాశాల విద్యార్థులను ఈ సెంటర్‌కు వెళ్లాలని ఆదేశిస్తుంటారు. వాస్తవంగా విద్యార్థులు చదివే కళాశాలల్లోనే ఆన్‌లైన్ దరఖాస్తు చేయాల్సి వుంటుంది. అలా చేయకుండా విద్యార్థుల నుంచి కొంత నగదును వసూలు చేసి ప్రైవేటు ఇంటర్‌నెట్ సెంటర్లకు పంపడం విశేషం.

## అదృష్టవంతురాలిని!

చిన్నప్పుడు విపరీతంగా ఐస్‌క్రీమ్‌లు తినేదాన్ని. ఇప్పుడు తినడం లేదు. కాలేజీ రోజుల్లో విహారయాత్రలకు వెళ్లడానికి ఇష్టపడేదాన్ని. కానీ ఇప్పుడు ఆ ఆసక్తి తగ్గింది అంటోంది హీరోయిన్ సమంత. పరిస్థితుల్ని బట్టి లక్ష్యాలు మార్చుకుంటారా? అని అడిగితే మార్చుకుంటాను. సినిమాల్లోకి రాక ముందు నా ఆశయాలు వేరు. ఇప్పుడు వేరు. ఉన్నత చదువులు చదవడం, విదేశాల్లో లక్షలు వచ్చే ఉద్యోగం సంపాదించడమే నా లక్ష్యం. ఇప్పుడు నటినయ్యాక నా లక్ష్యం మారిపోయింది. మంచి పాత్రలు పోషించాలి. వాటితో ఎక్కువమంది ప్రేక్షకుల అభిమానాన్ని పొందాలి. దేవుడి దయ వలన నేను నటించిన చిత్రాలన్నీ మంచి విజయాలు సాధించాయి. ఇదంతా చూస్తుంటే నేను అదృష్టవంతురాల్ని అనే మాట నమ్మాలేమో అనిపిస్తుందని చెప్పింది.

## ఇష్టమైన పాత్రలు దొరకవు!

ఎప్పుడూ మనకు ఇష్టమైన పాత్రలు కావాలంటే దొరకవని చెబుతుంది హీరోయిన్ ఇలియానా. ఈ విషయమై మాట్లాడుతూ ఎప్పుడూ మనసుకు నచ్చిన పాత్రలే రావు. నటించగా నటించగా అలాంటి పాత్రలు లభిస్తాయి. నా మనసుకు నచ్చే పాత్రలు దొరికే వరకు నటించనంటే కుదరదు. నటించడమే నా పని. ఈ సూత్రంతోనే కెరీర్‌లో ముందడుగు వేస్తున్నాను. మంచి పాత్రలు దక్కించుకొన్నాను. నటిగా నేనేంటో నిరూపించుకున్నాను. కొన్ని సార్లు మనకు నచ్చని పాత్రలు కూడా మంచి పేరు తెచ్చి పెడతాయంటుంది ఇలియానా.



## ఆత్మసంతృప్తి కలిగించదు!

అదృష్టం ఒక్కటే విజయానికి మార్గం అని ఎవరైనా చెబితే నమ్మొద్దంటుంది హీరోయిన్ కాజల్. ఈ విషయమై మాట్లాడుతూ కృషి, దీక్ష, పట్టుదల లేకుండా వచ్చిన ఏ విజయమైనా అంత ఆత్మసంతృప్తి కలిగించదు. అదృష్టమే నన్ను ఇంత పెద్ద స్టార్‌ని చేసిందంటే నేను ఒప్పుకోను. అవకాశం రావడం అదృష్టమే. కానీ తర్వాత నేను ఎదిగిన క్రమం అంతా కష్టమే. నటిగా నేను ఎంచుకొన్న పాత్రలు, వాటికి న్యాయం చేయడానికి నేను పడిన కష్టమే నన్ను ఓ మంచి నాయికగా ప్రేక్షకులకు చేరువ చేశాయి. పొరపాటున సినిమా ఫ్లాప్ అయితే దానికి కారణం నేను కాదు అని తప్పించుకోను. వేరే ఎవరిపైనా నింద అస్సలు వేయను. అలా ఎందుకు జరిగిందో ఆత్మ విమర్శ చేసుకొంటాను. అలా చేస్తేనే జీవితం ఓ క్రమ పద్ధతిలో సాగుతుందని చెప్పింది.



## బాగా ఎంజాయ్ చేశాం!

సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు చిత్రం విజయవంతమవడంతో హీరో వెంకటేష్ చాలా ఆనందంగా ఉన్నాడు. ఇద్దరు హీరోలు కలిసి నటిస్తే పాత్రల విషయంలో ఎక్కువ తక్కువలు అనే బేదాభిప్రాయాలు వస్తాయంటారు. మరి మీకు మహేష్‌కు అలా అనిపించలేదా అంటే అస్సలేదని సమాధానమిచ్చారు. ఇతరత్రా కథల విషయంలో అలా అనిపిస్తుందేమో కానీ... ఇలాంటి కథల్లో నటిస్తున్నప్పుడు ఇద్దరు నటుల మధ్య ఎక్కువ తక్కువ అనే బేదాభిప్రాయాలు రాకూడదు. ఒక వేళ వస్తే మాత్రం మనం అనుకొన్న భావోద్వేగాలు తెరపై పండవు. మనసులో ఏమీ పెట్టుకోకుండా నేనూ, మహేష్ ఈ సినిమా ఒప్పుకున్నాం. అలాగే నటించాం. అందుకే సన్నివేశాలు అంత బాగా పండాయి. మేమిద్దరం అన్నదమ్ముల్లాగే సెట్‌లోకి వెళ్లాం. అలాగే బయటకొచ్చాం. మహేష్‌తో కలిసి సన్నివేశాలుంటే ఆ రోజు సెట్‌కు ఎంత తొందరగా వెళ్దామా అనిపించేది. నా నటన చూస్తూ తను, తన నటన చూస్తూ నేను బాగా ఎంజాయ్ చేసేవాళ్లమన్నారాయన మనఃస్ఫూర్తిగా నవ్వుతూ.



## తగ్గిన ప్రియమణి!

ఈ మధ్య హీరోయిన్ ప్రియమణి బాగా తగ్గింది. అవకాశాల కోసమే నాజూగ్గా తయారయ్యారా అని ఆమెను అడగ్గా అదేం కాదు, మరీ అంత లావుగా అయితే నాలా నేను లేను. కానీ కొంచెం సన్నబడితే మంచిదని ఒళ్లు తగ్గించాను. బొద్దుగా ఉంటే లావుగా ఉన్నానంటారు; సన్నబడితే జీరో అనేస్తున్నారు. ఎలా కనిపించినా ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంటారు. అవకాశాలు రాకకాదు. మంచి పాత్రలు రావట్లేదని అంగీకరించట్లేదు. ఏది అంటే అది ఒప్పుకుంటే ఉన్న పేరంతా పోతుందంటుంది.




✍ అల్లూరు రహీం

ఇస్లామిక్ టెర్రరిజం పేరు చెప్పి ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఇరాక్, కువైట్, పాకిస్తాన్ వంటి సార్వభౌమత్వ దేశాలలో ప్రపంచ పోలీస్‌గా తనను తాను అభివర్ణించుకొనే అమెరికా చేసే దురాగతాల గూర్చి వేల కొలది పుస్తకాలు వ్రాయవచ్చు. ప్రపంచ ప్రజలను మాయ చేయను అమెరికా నేటికీ టెర్రరిజం పేరు వాడుకొంటుంది. కాని దాని శ్యాసధ్యాస ఆ దేశాల్లో నిక్షిప్తమైన ఆయిల్. దీనికోసం అమెరికన్ పాలకులు పన్నే పన్నాగాలు చిత్ర విచిత్రంగా ఉంటాయి. అమెరికా చేసే తప్పులను ప్రపంచంలో నలుగురైదుగురు దేశాధి నేతలు మాత్రమే గట్టిగా ఖండిస్తారు. సద్దాం హుస్సేన్ వంటి ధీరోధాత్తుడు అమెరికాకు ఎదురు నిలబడి పోరాడినందుకు దారుణ మరణానికి గురయ్యాడు. ఆ తర్వాత కూడ అమెరికన్ మీడియా ఆయన పరమ భ్రష్టుడని ప్రపంచాన్ని నేటికి నమ్మింపజూస్తుంది. లాడెన్ వంటి ఇస్లామిక్ తీవ్రవాదిని పాకిస్తాన్‌కు తెలియకుండా మట్టుపెట్టి సముద్రంలో అతన్ని శవాన్ని పడేసి ప్రపంచానికి ఆ తర్వాత తెలియ చెప్పిన అమెరికాకు నేటికీ ఆల్‌ఖైదా పేరు వింటే వెన్ను జలదరిస్తుంది. పై సోదంతా ఎందుకు వ్రాయాల్సి వస్తుందంటే రాజ్‌కమల్ సినిమా పతాకంపై దేశం గర్వించదగ్గ నటుడు కమల్‌హాసన్ విశ్వరూపం చిత్రాన్ని తీశాడు. ఈ సినిమాలో ఇస్లామిక్ టెర్రరిజం కథావస్తువు. ఆఫ్ఘనిస్తాన్‌లోని ఇస్లామిక్ తీవ్రవాదులు, వీరికంటే కరడుకట్టిన జిహాదీల గూర్చి చాలా లోతుగా విశ్వరూపంలో చర్చించారాయన. వాస్తవానికి ఇస్లామిక్ తీవ్రవాదుల కుటుంబ నేపథ్యాలు చూస్తే కళ్ల చెమరుస్తాయి. అమెరికాను సర్వనాశనం చేయాలని ఈ చిత్రంలో భీషణ ప్రతిజ్ఞ చేసే జిహాదీ తన భార్య క్షయరోగంతో బాధపడుతుంటే బాగు చేయించుకొలేని అసమర్ధపు భర్త. కాని తీవ్రవాదుల వేటంటూ నాటో దళాలతో వచ్చి మట్టితో కట్టుకొన్న తమ ఇళ్లను బాంబులు వేసి పేల్చేస్తుంటే చూసి తట్టుకోలేక భార్య కన్నా వర్గ శత్రువును అంతమొందించడమే ముఖ్యమని తలుస్తాడు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంలో ఎంతో ఎదిగిన అమెరికాను అదే పరిజ్ఞానంతో మట్టి గరిపించాలనే ప్రయత్నంలో జిహాదీలు వేసే ఎత్తులు చిత్రం చూస్తున్న ప్రేక్షకులను మంత్ర ముగ్ధులను చేస్తాయి. ఆఫ్ఘనిస్తాన్ కొండలు, కాబుల్ ఎడారుల్లో ఉగ్రవాదుల శిక్షణ, సరిహద్దుల్లో జిహాదీల ఆత్మాహుతిదాడి, తోరాబోరా గృహలు, వాటిలో లాడెన్, జార్జిబుష్, ఇస్లామిక్ చట్టం ప్రకారం ఉరి, న్యూక్లియర్ అంకాలజీ పరిజ్ఞానంతో అమెరికాను సర్వనాశనం చేయాలన్న ఎత్తుగడతో రూపొందిన సన్నివేశాలు క్లాస్ మినహా మాస్ ప్రేక్షకులకు అర్ధమయ్యేటట్లు విశ్వరూపంలో లేవు. ఇళయరాజా వ్రాసిన కథకు కమల్‌హాసన్ మెరుగులు దిద్దలేకపోయాడు. అంతర్జాతీయ స్థాయిలో కెమెరా పనితనం, టేకింగ్ ఉన్న ఈ చిత్రానికి వెన్నెలకంటి మాటలు వ్రాయను చాలా కష్టపడ్డాడు. ఎందువల్లో ఈ చిత్రంలో కమల్‌హాసన్ ఇస్లామిక్ తీవ్రవాదాన్నే ఎక్కువగా చూపించాడు. కాని దీనికి కారణమైన అమెరికా గూర్చి చర్చించలేకపోయాడు.




చిత్రకథలోనికి వెళ్తే విశ్వనాధ్ (కమల్‌హసన్) అమెరికాలో న్యూక్లియర్ అంకాలజిస్ట్ నిరుపమ (పూజ)ను పెళ్లి చేసుకొని డ్యాన్స్ స్కూల్ నడుపుతుంటాడు. ఈ స్కూల్‌లో అస్మిత (ఆండ్రియా) ఓ విద్యార్థినిగా ఉంటుంది. నిరుపమ తన సహోద్యోగి దీపక్‌తో అక్రమ సంబంధం కొనసాగిస్తుంటుంది. ఒకసారి ఓ తీవ్రవాదుల ముఠా విశ్వనాధ్, నిరుపమ, దీపక్‌లను కిడ్నాప్ చేస్తుంది. ఈ సందర్భంగా విశ్వనాధ్ ప్రదర్శించే ధైర్య సాహసం, చేసే పోరాటాలు చూసి అతని భార్య విస్తుపోతుంది. ఇంతలో కథ ఫ్లాష్‌బ్లాక్‌లోనికి వెళ్తుంది. విశ్వనాధ్ వాస్తవానికి భారతదేశంలోని అంతర్జాతీయ వ్యవహారాలు చూసే 'రా' విభాగంలో గూఢచారి. భారతదేశం తరపున ప్రత్యేక ఆపరేషన్‌లో భాగంగా ఆఫ్ఘనిస్తాన్ వెళ్లి అంతర్జాతీయ ఇస్లామిక్ తీవ్రవాది ఓమర్‌తో కలసి తను జిహాదీగా మారుతాడు. ఆఫ్ఘనిస్తాన్ తీవ్రవాదులు అమెరికాను సర్వనాశనం చేసే ఎత్తులను చిత్తు చేస్తున్న సమయంలోనే ఎఫ్‌బిఐ చేతికి చిక్కి, భారత విదేశాంగ రాయబారి సహకారంతో రక్షింపబడుతాడు. అమెరికా సర్వనాశనం కాకుండా ఇస్లామిక్ తీవ్రవాదులు పేల్చాలనుకొనే విచిత్ర బాంబు దాడి నుంచి ఆ దేశాన్ని కాపాడి ఇండియాకు పయనమవడంతో చిత్రం ముగుస్తుంది. ఈ సినిమా నిర్మాణానికి వందకోట్ల రూపాయలు ఖర్చయ్యి ఉండవచ్చు. కానీ జనరంజకంగాలేని విశ్వరూపాన్ని సామాన్య ప్రేక్షకుడు ఎందుకు చూడాలి?

## ఆర్ఎంఎస్ ఉద్యోగుల క్రికెట్ పోటీలు!



క్రికెట్ పోటీకి సిద్ధంగా ఆర్ఎంఎస్ సిబ్బంది.

గణతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకొని తపాలా శాఖలోని ఆర్ఎంఎస్ రిక్రియేషన్ క్లబ్ నెల్లూరు బ్రాంచి ఉద్యోగులకు టి 20 క్రికెట్ మ్యాచ్‌ను వెంకటేశ్వరపురంలోని గవర్నమెంటు పాలిటెక్నిక్ కాలేజీలో నిర్వహించారు. ఇందులో ఉద్యోగులు రెండు జట్లుగా పాల్గొన్నారు. మునిశేఖర్ కెప్టెన్‌గా ఉన్న జట్టు గెలుపొందింది. జట్టు సభ్యులకు 26వ తేది ఆర్ఎంఎస్ కార్యాలయం వద్ద నిర్వహించిన సభలో బహుమతి ప్రదానం చేశారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఆర్ఎంఎస్ ఇన్స్‌పెక్టర్ ఎస్.చక్రపాణి పాల్గొన్నారు.

## మనిషి జీవన విధానాన్ని తెలిపేది భగవద్గీత!

### ● నెల్లూరులో స్వామి పరిపూర్ణానంద



ఆధ్యాత్మిక ఉపన్యాసం ఇస్తున్న స్వామి పరిపూర్ణానంద.

పరమాత్మను చేరుకోవాలనే లక్ష్యంతో మానవుడు ముందుకు సాగాలని, అందుకు నిత్యం భగవంతుని స్మరించాలని శ్రీపీఠం వ్యవస్థాపకులు పరిపూర్ణానంద స్వామి తెలిపారు. నగరంలో జరిగే గీతాజ్ఞానయజ్ఞం, వెంకటేశ్వరుని కళ్యాణ కార్యక్రమాలలో ఆయన పాల్గొని భక్తులకు అనుగ్రహభాషణ చేశారు. మనిషి ఎలా బ్రతకాలి, ఎందుకు బ్రతకాలి అన్న అంశాలను భగవద్గీత తెలుపుతుందన్నారు. జీవన విధానాన్ని నేర్పించే గీతను ప్రతి ఒక్కరూ చదవాలని సూచించారు. మంచి జరగాలంటే సమయం పడుతుందని, చెడుకు అంత సమయం అవసరం లేదన్నారు. జన్మించడం, మరణించడం రెండు బిందువులని ఈ రెండింటినీ కలుపుతూ గీచే గీతనే జీవితం అంటారన్నారు. అలాంటి జీవన గీత భగవద్గీతతో ముడిపడినట్లయితే జీవితానికి సార్థకత ఏర్పడుతుందన్నారు. భగవంతుడిని చేరుకునేందుకు మార్గాన్ని, మాధ్యమాన్ని వెతుకుతూ నిర్దిష్ట మార్గంలో ప్రయాణించాలన్నారు. భగవద్గీత పఠనంతో జీవితాన్ని సార్థకం చేసుకోవాలన్నారు. పరిపూర్ణత్వమే దైవత్వానికి పునాదిగా చెప్పారు. ప్రపంచంలో అన్ని నదుల కంటే గంగానది పరమ పవిత్రమైనదన్నారు. విష్ణువు, శివుడు, ఋషుల పాదస్పర్శతో మూడు రూపాలుగా మారుతుందన్నారు. ఈ గంగానది ఒడ్డునే పరమ శివుడు తారక మంత్రాన్ని ఉపదేశించారని తెలిపారు. గంగలో నిత్యం స్నానం చేయడం ద్వారా సకల పాపాలు హరించుకు పోతాయన్నారు. తిక్కన మహాకవితోపాటు ఎందరో మహానుభావులను అందించిన సింహపురి సీమను తానెన్నడూ మరువలేనని, తన చివరి శ్వాసవరకు నెల్లూరుకు అన్నివిధాల తోడ్పాటునందిస్తానన్నారు. విఆర్‌సి గ్రౌండ్‌లో గీతాయజ్ఞం కార్యక్రమాన్ని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి ప్రారంభించారు. దీనిలో బి.వి.నరసింహం, హజరత్‌బాబు, రవీంద్రబాబు, విజయకుమార్‌రెడ్డి, బలరామయ్య నాయుడు పాల్గొన్నారు.



ఉత్తమ సేవలకుగాను కలెక్టర్ చేతులమీదుగా పురస్కారం అందుకొంటున్న స్పెషల్ బ్రాంచ్ సిఐ వి.ఎన్.రాంబాబు.

## పోలీస్ శాఖలో ఉత్తమ సేవా పతకాలు!

పోలీస్ శాఖలో ఉత్తమ సేవలు అందించిన 53 మంది పోలీస్ అధికారులు, సిబ్బందికి గణతంత్ర దినోత్సవపు వేడుకల్లో ప్రశంసాపత్రాలు అందించారు. వీటిని అందుకొన్న వారిలో ఎఎస్పీలు టి.చంద్రశేఖర్, ఎ.సి.నాగేశ్వరరావు, డిఎస్పీలు పి.వెంకటనాథ్‌రెడ్డి, కె.బాలకోటేశ్వరరావు, కె.సురేష్‌కుమార్, పి.రాజమహేంద్ర నాయక్, స్పెషల్ బ్రాంచ్ సిఐ వి.ఎన్.రాంబాబు, ఎన్.కిషోర్‌బాబు, క్రైం సిఐ వీరాంజనేయరెడ్డి, ఎం.శ్రీనివాసరావు, ఎస్సీ రాజశేఖర్‌రెడ్డి, ఎం.మంగారావు, కె.వేమారెడ్డి, బి.ప్రసాద్, ఎం.మధుబాబు, ఎం.హనుమంతరావు, ఆర్.వి.చిరంజీవి, ఎస్ఐలు ఎ.నాగేశ్వరరావు, వైవి సోమయ్య, బి.వేణుగోపాల్‌రెడ్డి, ఎం.బాబి, ఆర్ఎస్ఐలు కె.అంకమరావు, ఎఎస్ఐలు బాషామొహిద్దీన్, కె.మహబూబ్ బాష, పి.వి.రమణయ్య, జి.గురునాధశర్మ తదితరులున్నారు.

## బ్యాంకు అధికార్లపై కలెక్టర్ ఆగ్రహం!

### రుణాలివ్వమని మరోసారి విన్నపం



బ్యాంకు అధికారుల పనితీరుపై జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ మరోసారి ఆగ్రహం వ్యక్తం చేశారు. గతంలో రైతులకు, వ్యవసాయ రుణాలు, నిరుద్యోగులకు బ్యాంకు లింకేజీ రుణాలు మంజూరు చేసేందుకు నిరాకరిస్తే కేసులు నమోదు చేయాలని వ్యాఖ్యానించారు. ఇటీవల వివిధ బ్యాంకులకు చెందిన అధికారులతో జిల్లాస్థాయి సమీక్ష సమావేశం జరిగింది. ఈ సమావేశానికి హాజరైన జిల్లా కలెక్టర్ అధికారులు అవలంభిస్తున్న విధానాలపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. ప్రభుత్వ శాఖలకు సంబంధించిన నిధులు బ్యాంకుల్లో డిపాజిట్లుగా ఉన్నప్పటికీ బ్యాంకు లింకేజీ రుణాలు ఎందుకు మంజూరు చేయడం లేదని వారిని ప్రశ్నించారు. పలు దఫాలు పనితీరును మార్చుకోవాలని కోరినా ఎందుకు మారడం లేదని నిలదీశారు. నెలల తరబడి లబ్ధిదారులు బ్యాంకుల చుట్టూ తిరుగుతున్నా సరైన సమాధానం చెప్పక పోవడం తమ దృష్టికి వచ్చిందన్నారు. ఇదే విధానాన్ని కొనసాగిస్తే ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లి డిపాజిట్లు వెనక్కు తీసుకోవాల్సి వస్తుందని ఘాటుగా హెచ్చరికలు చేశారు. కలెక్టర్ వ్యాఖ్యలతో ఖంగు తిన్న బ్యాంకు అధికారులు మౌనంగా ఉండిపోయారే తప్ప తిరిగి సమాధానం చెప్పేందుకు ప్రయత్నించ లేదు. రుణాలు ఇవ్వకపోతే కలెక్టర్ తమను ఏం చేయలేరన్న ధీమా బ్యాంకు అధికారుల్లో ఉంది.

## తూర్పు ప్రాంత అభివృద్ధికి కృషి!

### ● వికాస్ ప్రజాహిత సమితి సభలో మేకపాటి



ఉత్తమ సేవకులను సన్మానిస్తున్న ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి. ప్రక్కన కర్తం ప్రతాప్‌రెడ్డి తదితరులు.

తూర్పు ప్రాంత అభివృద్ధికి తనవంతు కృషి చేస్తానని నెల్లూరు పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి హామీ ఇచ్చారు. బాలాజీనగర్ ప్రాంత వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు, వికాస్ స్కూల్ నిర్వాహకుడు కర్తం ప్రతాప్‌రెడ్డి వికాస్ ప్రజాహిత సేవా సమితిని స్థాపించి పలు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్న విషయం తెలిసిందే. దీనిలో భాగంగా పదవీ విరమణ చేసిన పలువురు ఉద్యోగులు, సమాజ సేవకులకు అవార్డు ప్రదానోత్సవ సభ జనవరి 25వ తేది జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి మాట్లాడుతూ బాలాజీనగర్ ప్రాంత ప్రజలకు రక్షిత నీటిని అందించేందుకు సొంత నిధులతో మినరల్ వాటర్ ప్లాంట్ ఏర్పాటు చేస్తానని హామీ ఇచ్చారు. ఇలాగే ఎసినగర్ పార్కును అభివృద్ధి చేసేందుకు ఎమ్పీ నిధులను అందజేస్తానన్నారు. ప్రజాస్వామ్యం పరిఢవిల్లాలంటే మంచి నాయకులను ఎన్నుకోవాల్సిన బాధ్యత ప్రజలపై ఉందన్నారు. ప్రజాహిత సేవా సమితి స్థాపించి గత ఐదేళ్లుగా కర్తం ప్రతాప్‌రెడ్డి చేస్తున్న కృషి అభినందనీయం అన్నారు. విధి నిర్వహణలో అంకితభావంతో పనిచేసి ఎలాంటి అవార్డుకు నోచుకోని వారిని, ప్రజాసేవా కార్యక్రమాలు చేపట్టే వారిని గుర్తించి అవార్డును అందజేసి, సన్మానిస్తున్నట్లు ప్రతాప్‌రెడ్డి తెలిపారు. అనంతరం 150 మందిని ఈవిధంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు ఆనం వెంకటరమణారెడ్డి, సుబ్బారెడ్డి, ఖాజావలి తదితరులు పాల్గొన్నారు.

## ఖజానా డిడిపై రహస్య విచారణ!

### గట్టిగా చెప్పిన పోలీసు అధికారుల సంఘం

జిల్లా ఖజానా కార్యాలయం డిప్యూటీ డైరక్టర్‌గా ఉండి వివిధ ఆరోపణలపై బదిలీ కాబడిన భ్రమరాంబపై శాఖాపరమైన విచారణ జరిగింది. ఇటీవల రాష్ట్ర ఆర్థిక శాఖ నుంచి ఉన్నతాధికారుల బృందం నెల్లూరుకు విచ్చేసి ఖజానా కార్యాలయంలో విచారణ నిర్వహించింది. భ్రమరాంబ డిడిగా ఉన్న సమయంలో పోలీసులకు సంబంధించిన బిల్లులను మంజూరు చేసేందుకు కమిషన్, వాహనానికి డీజిల్ డిమాండ్ చేశారన్న ఆరోపణలు ఉన్నాయి. ఉన్నతాధికారిణి ఇలా కమిషన్ అడగడంతో పోలీసులు సైతం అవాక్కయ్యారు. పలుమార్లు డిడి చుట్టూ తిరిగి బిల్లులు మంజూరు చేయాలని కోరినా ఆమె స్పందించ లేదు. ఈ విషయాన్ని అసోసియేషన్ దృష్టికి తీసుకెళ్లడంతో కొందరు నేతలు డిడితో మాట్లాడిన సమయంలో కూడా ఆమె లంచం అడగడంతో సెల్‌ఫోన్ రికార్డు చేసినట్లు అప్పట్లోనే ప్రకటించారు. డిడి లంచం అడిగిన విషయాన్ని జిల్లా ఎస్పీ రమణకుమార్ దృష్టికి తీసుకెళ్లడంతో ఆయన వెంటనే స్పందించి రాష్ట్ర ఆర్థిక శాఖ కార్యదర్శికి ఫిర్యాదు చేశారు. ఎస్పీ ఫిర్యాదుతో ఆకస్మికంగా భ్రమరాంబను జిల్లా నుంచి బదిలీ చేసింది ప్రభుత్వం. ఆమెపై అందిన ఫిర్యాదుపై విచారణ కోసం వచ్చిన అధికారుల బృందాన్ని పోలీసు అసోసియేషన్ నేతలు కలుసుకొని తన వాదనలు వినిపించినట్లు తెలిసింది. మీడియాకు సమాచారం అందించకుండా ఆ శాఖ అధికారులు జాగ్రత్త పడ్డారు.

## మహా కుంభమేళా!

8వ పేజీ కొరవ

మాట ప్రకారం రాక్షసులకు పంచడానికి దేవతలు ఇష్టపడరు. ఇద్దరూ కలిసి 12 రోజులపాటు ఘోర యుద్ధం చేస్తారు. దేవలోకంలో ఒక రోజు అంటే మానవ లోకంలో ఒక సంవత్సరంతో సమానం. ఆ యుద్ధంలో రాక్షసులు విజయం సాధించే ప్రమాదం కన్పించడంతో శ్రీ మహావిష్ణువు అమృత భాండాన్ని అక్కడ నుంచి తీసుకొని దూరంగా వెళ్లిపోతాడు. ఆ ప్రయాణంలో ఆ భాండం నుంచి అమృతం చుక్కలు ప్రయాగ, నాసిక్, ఉజ్జయిని, హరిద్వార్లలో జారి పడతాయి.

అమత్రుపు చుక్కలు జాలు వారిన నదీ జలాలు కాబట్టి వాటిలో స్నానం చేస్తే అమరత్వం సిద్ధిస్తుందన్నది హిందువుల నమ్మకం. కొన్ని వేల తరాలుగా ఈ నమ్మకం వారి హృదయాలలో సజీవంగా కొనసాగుతూనే వుంది.

సూర్యుడు మకర రాశిలో, బృహస్పతి వృషభ రాశిలో ప్రవేశించే ముహూర్తమే అలహాబాదులో (ప్రయాగ) జరిగే కుంభమేళాకు ముహూర్తం. యమున, గంగ, సరస్వతి నదుల త్రివేణీ సంగమం కావడంతో తతిమా మూడు చోట్ల (హరిద్వార్, నాసిక్, ఉజ్జయిని) కంటే అధిక ప్రాధాన్యం. ప్రతి పన్నెండేళ్లకొకసారి కుంభమేళా జరుగుతుంది. కానీ ఈసారి జరుగుతున్నది మహా కుంభమేళా. 144 సంవత్సరాలకొకసారి మాత్రమే ఇటువంటి ముహూర్తం వస్తుందట. అందువల్ల దేశంలోని హిందు మత పీఠాధిపతులు, మత ప్రచారకులు, సన్యాసులు, సాధువులు, హిమాలయాలలో ముక్కు మూసుకొని తపస్సు చేసుకొనే సర్వసంగ పరిత్యాగులు, అఘోరాలు వంటి వారందరూ ఈ మహా మేళాలో పాలు పంచుకొంటున్నారు. హిందు మతంతో సంబంధం కల్గిన ప్రతిఒక్కరూ అలహాబాదులో మకాం పెట్టి వున్నారిప్పుడు. అదొక అపూర్వ సమ్మేళనంగా నడుస్తున్నది. మామూలుగానే కుంభమేళాకు కోట్ల సంఖ్యలో ప్రజలు వస్తారు. ఈసారి మరింత ప్రత్యేకం కావడంతో దాదాపు 10కోట్ల మంది గంగా స్నానం చేయనున్నారని అంచనా. వీరంతా ఎక్కడ నుంచి వస్తున్నారో, అందుకోసం ఎంత ప్రయాస పడుతున్నారో, మేళా జరిగే ప్రదేశంలోని అరకొర సౌకర్యాలతో ఎన్ని అవస్థలు పడుతున్నారో వూహించడం కష్టం. వూహ కందని ఆ మానవ సమూహ విచిత్రాన్ని అర్థం చేసుకోవడానికి అమెరికా, ఇంగ్లాండ్ వంటి దేశాలకు చెందిన మేనేజ్‌మెంట్ కళాశాలల అధ్యాపకులు, పరిశోధకులు వందలాది మంది కుంభమేళాను పరిశీలిస్తున్నారు. ఇన్ని కోట్ల మంది అక్కడకు వచ్చి, స్నానం చేసి, వచ్చిన దారినే సాఫీగా వెళ్లి పోవడానికి ఏర్పాట్లు చేస్తున్న భారత ప్రభుత్వ సామర్థ్యం వారికి అచ్చెరువు కల్గిస్తున్నది.

కుంభమేళా నిర్వహణ గిన్నీస్ బుక్ రికార్డుల కెక్కిన ఘనత. ఈసారి దానికి మరిన్ని ఆధునిక హంగులు సంతరించింది ప్రభుత్వం. ఇస్రో సహాయంతో ఒక ఉపగ్రహాన్ని కుంభమేళా జరిగే 58 చదరపు కిలోమీటర్ల పరిధిపైకి కేంద్రీకరించారు. ప్రతి 24 గంటలకొకసారి ఆ ఉపగ్రహం కుంభమేళా ప్రాంతాన్ని ఫోటోలు తీస్తున్నది. దాని ద్వారా ఈ ఉత్సవానికి హాజరయ్యే భక్తుల సంఖ్య ఎంత అన్న అంచనాకు వస్తున్నారు. గూగుల్ మ్యాప్ సంస్థ కూడా తన ఉపగ్రహాలను ఇటువైపు తిప్పింది.

### విశేషాలు

మకర సంక్రాంతి ఒక్క రోజు కోటి మంది భక్తులు ఒకేసారి త్రివేణి సంగమంలో స్నానాలు చేశారు.

ఫిబ్రవరి 10తేది మౌన అమావాస్య రోజు ఈ సంఖ్య 3కోట్లు దాటుతుందని అంచనా.

2500 మంది మఠాధిపతులు కుంభమేళాలో మకాం పెట్టి వున్నారు.

ఏ పీఠాధిపతి ఎక్కడ వున్నాడో భక్తులకు తెలపడానికి ప్రతి మఠం గుడారానికి జీపిఎస్ పరికరాలు అమర్చారు. వాటి ద్వారా తాము పూజించే స్వామీజీలను సులభంగా కలుసుకోగలుగుతున్నారు భక్తులు.

రిచర్డ్ గెరే, మిచైల్ డగ్లస్ వంటి ప్రసిద్ధ హాలీవుడ్ నటులు కుంభమేళాకు హాజరౌతున్నారు.

భాగ్యవంతులైన భక్తుల కోసం రోజుకు లక్ష రూపాయల రుసుము లెక్కన ప్రత్యేక గుడారాలు, హెలికాప్టర్ సదుపాయం కల్పిస్తున్నారు. ఆ సొమ్ము చెల్లించగలిగితే హెలికాప్టర్‌లో గగన విహారం చేస్తూ కుంభమేళా జరిగే ప్రాంతమంతటినీ గంటపాటు వీక్షించవచ్చు. వీరి కోసం ప్రత్యేక స్నాన ఘట్టాలు కూడా నిర్మించారు.

భక్తుల తాత్కాలిక విడిది కోసం 35వేల గుడారాలు వేశారు. వాటన్నిటికీ మరుగు దొడ్ల సౌకర్యం కూడా కల్పించారు.

కుంభమేళా కోసం ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం 1200 కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నది. అయితే మేళా వల్ల ప్రభుత్వానికి 12 వేల కోట్లకు పైగా రాబడి వస్తుందని అంచనా. దాదాపు 6 లక్షల మంది ప్రభుత్వ ఉద్యోగులు, ప్రైవేటు సేవకులు, వ్యాపారులు ఉపాధి పొందుతున్నారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఆత్మకూరు బస్టాండ్‌లో ఆవిర్భవించింది. సంఘం అధ్యక్షునిగా మాజీ జర్నలిస్ట్ జీవిప్రసాద్, ప్రధాన కార్యదర్శిగా షేక్ సిరాజ్, ఉపాధ్యక్షునిగా రఘురామయ్య, సహాయ కార్యదర్శిగా ఉప్పు ఏడుకొండలు, కోశాధికారిగా షేక్ గౌస్‌ను ఎన్నుకొన్నారు. ఈ సందర్భంగా ప్రసాద్ మాట్లాడుతూ బస్టాండ్‌లలో వ్యాపారాలు చేసుకొనేవారు అటు యాజమాన్యం, ఇటు ప్రయాణీకులతో మంచి సంబంధాలు నెరపేలా సంఘాన్ని అభివృద్ధి చేస్తామన్నారు.

### ప్రభవలో ఫ్యాన్సీ డ్రస్!

నెల్లూరు పొగతోటలోని ప్రభవ బడిలో 26వ తేది ఫ్యాన్సీ డ్రస్ కార్యక్రమం నిర్వహించారు. భారతీయ వైవిధ్యాన్ని ప్రతిఫలించే విధంగా వివిధ రాష్ట్రాల సాంప్రదాయ వస్త్రధారణ ప్రధానాంశంగా తీసుకొని నిర్వహించిన పోటీలో టాడ్లర్ గ్రూపులో సాయి లోకేష్, ఆహిల్, ధున్ పోర్వాల్, ప్రభవ శౌరి వరుస బహుమతులు గెలుపొందారు. ప్లే గ్రూప్‌లో కనిష్క, ధరుణ్, హృతికేశ్ మొదటి మూడు స్థానాల్లో నిలచారు. ఈ కార్యక్రమానికి డాక్టర్ లలితా నారాయణరెడ్డి, హిమబిందు, బి.సురేష్‌బాబు, న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. ప్రిన్సిపాల్ చంద్రలత స్వాగత, వందనాలు చెల్లించారు.

### బివిరావు 17వ వర్థంతి!

భారతదేశ కోళ్ల పరిశ్రమ పితామహుడు పద్మశ్రీ డాక్టర్ బివిరావు 17వ వర్థంతిని 26వ తేది నెల్లూరులో నేషనల్ ఎగ్ కో ఆర్డినేషన్ కమిటీ ఘనంగా నిర్వహించింది. ఈ సందర్భంగా నెక్ మాజీ జోనల్ ఛైర్మన్ బలరామయ్య నాయుడు నేతృత్వంలో నవాబుపేటలో బాలాజీ హేచరీలో డాక్టర్ బి.వి.రావు చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. అనంతరం ఉడికించిన కోడిగుడ్లను స్వర్ణభారత్ ట్రస్ట్‌లోని బివిరావ్, ఉత్తరాదేవి మెమోరియల్ హాస్పిటల్‌లోని రోగులకు, బ్రిడ్జి స్కూల్ విద్యార్థులు, వియాని, విశ్వభారతి అంధుల పాఠశాల, విశాలాక్షి వృద్ధుల ఆశ్రమాల్లో పంచి పెట్టారు. ఈ కార్యక్రమంలో నెక్ సభ్యులు ఎంఆర్ ప్రసాద్, కె.రాఘవ రావు, శివరామయ్య, పి.వెంకట్రామయ్య తదితరులు పాల్గొన్నారు.

### వేదవ్యాస స్కూల్‌లో గాలిపటాల పండుగ!

నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస హైస్కూల్‌లో 64వ గణతంత్ర దినోత్సవపు వేడుకలు ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా స్కూల్ కరస్పాండెంట్ ఎ.పి.బాలాజీ పతాకావిష్కరణ చేశారు. సాంస్కృతిక కార్యక్రమాల అనంతరం స్కూల్‌లో గాలిపటాల పండుగ నిర్వహించారు. దీనిలో విద్యార్థినీ విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు. స్కూల్ డైరక్టర్ వేదగిరి ఈ కార్యక్రమాలను పర్యవేక్షించారు.

### ఘరానా దొంగ దొరికాడు

గత కొంతకాలంగా జిల్లాలోని పలు ప్రాంతాలలో దొంగతనాలకు పాల్పడుతూ పోలీసుల కళ్లుగప్పి తిరుగుతున్న ఘరానా దొంగ ఎట్టకేలకు పోలీసులకు చిక్కాడు. జిలానీబాషా అనే ఈ దొంగ పగలు వివిధ ప్రదేశాలు తిరుగుతూ తాళం వేసిన ఇళ్లను గుర్తించి రాత్రివేళ ఆ ఇళ్లలో దొంగతనం చేయడంలో సిద్ధహస్తుడట. నగరంలోని వివిధ ప్రాంతాలలో చోరీలు చేసి తప్పించుక తిరుగుతున్న ఈ దొంగను ములుమూడి బస్టాండ్ వద్ద పట్టుకొన్నట్లు ఎస్పీ రమణకుమార్ చెప్పారు. అతని వద్ద నుంచి ఆరు లక్షల రూపాయలు విలువ చేసే నగలను రికవరీ చేసినట్లు తెలిపారు.

## ఆవేశకావేషాలు

మొదటి పేజీ కొరవ

కోమటిరెడ్డి వెంకటరెడ్డిల జాలి గాథను ప్రస్తావిస్తున్నారు మంత్రులు. జూపల్లి మళ్లీ జరిగిన ఉప ఎన్నికలలో గెలిచినా నియోజకవర్గానికి ఏమీ పనులు చేసుకోలేక, కెసిఆర్ నుంచి సరైన ఆదరణ పొందలేక మథన పడుతున్నాడు. కోమటిరెడ్డి వెంకటరెడ్డి జగన్ మీద నమ్మకంతో రాజీనామా చేశాడు. అయితే జగన్ సమైక్య వాదాన్ని తలకెత్తుకోవడంతో ఇబ్బంది వచ్చి పడింది. కెసిఆర్‌తో చేతులు కలపక తప్పని దుర్గతి. ఆయనకు అది ఎంత మాత్రం ఇష్టం లేదు.

తెలంగాణ మంత్రులందరిదీ అదే భావన. కెసిఆర్ మోచేతి క్రింద నీళ్లు త్రాగేకంటే ఈ పదిహేను నెలలు అధికారాన్ని అనుభవించి, ఐదేళ్లపాటు ప్రతిపక్షంలో కూర్చోవడం మేలని అంటున్నారు వారు. ఒకవేళ రాహుల్‌గాంధీ సమ్మోహనా శక్తి యువతరం మీద పని చేసి, పార్టీ పునరుజ్జీవం పొందితే మళ్లీ అధికారం వస్తుంది కాబట్టి అంతవరకు ఉద్యమాన్ని వ్యతిరేకించకుండా, అట్లని ఉద్యమం కోసం పదవులు త్యాగం చేయకుండా కాలం గడపాలనే నిర్ణయానికి వచ్చారు తెలంగాణ మంత్రులు.

## షర్మిల పాదయాత్ర

మొదటి పేజీ కొరవ

పక్కకు నెట్టేసి షర్మిలకు దారి ఇవ్వాలన్నది ప్రణాళిక. రాయలసీమ నుంచి గూండాలను తెచ్చి యాత్ర జరుపుతున్నారనే నింద పడకుండా కేవలం ఆయా ప్రాంతాలలోని కార్యకర్తలను మాత్రమే ఈ ప్రతిఘటనకు వాడుకోవాలని ప్రయత్నిస్తున్నారు. తెలంగాణ వాదులు ఆ ఏర్పాట్లు చూసి వెనక్కు జంకితే ఇబ్బంది లేదు. కానీ గతంలో మహబూబాబాద్‌లో జగన్‌ను నిలువరించిన తరహాలో అడ్డం వస్తే మాత్రం దొమ్మీ తీరులో అయినా సరే యాత్రను కొనసాగించాలన్నది షర్మిల ఉద్దేశమట. ఆ పార్టీ అగ్రనేతలు కూడా ఆ మేరకే సలహా ఇచ్చినట్లు తెలుస్తున్నది. తెలంగాణ ఉద్రిక్తత తగ్గేవరకు కొంతకాలం యాత్ర వాయిదా వేసుకోవాలన్న ప్రతిపాదనను షర్మిల అంగీకరించలేదట. ఏ రోజు మొదలు పెట్టినా ఏదో ఒక అంశం వివాదంలో వుంటూనే వుంది కాబట్టి, ధైర్యంగా సమస్యను ఎదుర్కొందామని చెప్పిందట ఆమె. దానితో ఆమె యాత్రకు ఇబ్బంది కలగకుండా అన్ని జాగ్రత్తలు తీసుకొంటున్నారు పార్టీ నేతలు. అయితే ఈ తీరులో యాత్రకు వీధులలోకి వస్తే తెలంగాణ వాదులు సహిస్తారా, వారు అడ్డం వస్తే పరిణామాలు ఏమిటి అన్నది వేచి చూడాలి.

## జనవాణి

2వ పేజీ కొరవ

విగ్రహాలను తొలగించాలన్న సుప్రీంకోర్టు ఉత్తర్వులు తక్షణం అమలయ్యేలా చూడాలి. స్వాతంత్ర్యం తెచ్చేదానికి కృషి చేసిన వారి విగ్రహాలు మినహా స్వాతంత్ర్యం వచ్చాక పుట్టిన వారి విగ్రహాలు తొలగింపుకు ఉపక్రమించను ఇంతకు మించిన సమయం దొరకదు.

వాస్తు రామచంద్ర నెల్లూరు

### ఎడ్లబండ్ల పోటీలు నిషేధించాలి!

జనవరి 18వతేది 'జమీన్‌రైతు' సంచికలో సంక్రాంతి సందర్భంగా కోవూరులో జరిగిన ఎడ్లబండ్ల పోటీల బొమ్మను ప్రచురించారు. ఈ పోటీలను ప్రజలు ఆసక్తికరంగా చూశారని వ్రాశారు. చూసేవారికి అవి ఆనందం కల్గించవచ్చుగానీ ఈ పోటీలో ప్రాణాలకు తెగించి పరుగెత్తను ఆ నోరు లేని మూగ జీవులు ఎంత బాధపడి ఉంటాయన్న కోణం నుంచి వార్త వ్రాసి ఉంటే బాగుండేది. ఈ పోటీల సందర్భంగా తీవ్రమైన బల ప్రదర్శనలను వాటిపై చూపుతారు వాటి యజమానులు. ఏది ఏమైనా ఎడ్లబండ్ల పోటీలు, బండ్ల లాగుడు పోటీలకు రాక్షస క్రీడకు పెద్ద తేడా లేదు. ఇటువంటి వాటిని జరగకుండా చూడాల్సిన బాధ్యత అధికారులు, రాజకీయ నాయకులు, ప్రజలపై కూడా ఉంది.

పి.ఆదిలక్ష్మి నెల్లూరు

### మహిళలకు శిక్ష ఏమిటి?

మహిళలపై మానభంగం చేసే వారిని కఠినంగా శిక్షించే చర్యలలో భాగంగా వారికి పురుషత్వం లేకుండా చేయాలని చాలామంది వాదిస్తున్నారు. మహిళల్లో కూడా పురుషులను మానభంగాలు చేసే వాళ్లున్నారు. ఇటువంటి వారిపై ఎటువంటి శిక్ష అమలు చేయాలన్న విషయమై కూడా చర్చ జరగాల్సిన తరుణమిదే.

ఎన్.మధుసూదనరావు హైదరాబాదు

## పదరంగం -53

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | | | 4 | | | 5 |
| | | 6 | | 7 | | 8 | | | | |
| | | | | 9 | | | | 10 | | |
| 11 | 12 | | 13 | | | | 14 | | | |
| | 15 | 16 | | | | | | | | |
| 17 | | | | 18 | 19 | | 20 | | 21 | 22 |
| | 23 | | 24 | | 25 | 26 | | | 27 | |
| 28 | | | | | | 29 | | 30 | | |
| 31 | | 32 | | 33 | | | 34 | | | 35 |
| | | | | 36 | | 37 | | | | |
| | | 38 | | | | 39 | | | | |

**అడ్డం**

1. సుస్పష్టం (4)
4. ముక్కంటివాడు (4)
6. తడబడిన అసలు (3)
8. శ్రేయస్కరం (2)
9. తెలుగు గ్రాస్‌హోపర్ (3)
10. ఉరి శిక్ష అమలు చేసేవాడు (3)
11. అటునుంచి ధూమం (2)
13. అమృతం (2)
14. పంట (2)
15. తడబడిన ఏలిక అటునుంచి (3)
17. దశరథుని మూడవ భార్య (3)
18. అటునుంచి మీనం (2)
20. లోపల ఉండునది (4)
23. తడబడిన కలత (3)
25. స్త్రీ (3)
27. అటునుంచి ఆర్గ్యుమెంటు (2)
29. దఫా (3)
31. ఫినిషింగ్ టచ్ (5)
34. ఇద్దరు మిత్రులు (4)
36. నాసికాభరణం (3)
38. శిరోజాలు (3)
39. భార్యాభర్తలు అటునుంచి వస్తున్నారు (5)

**నిలువు**

1. తెలుగు హనీబీ (4)
2. దేశభాషలందు లెస్స అయిన భాష (3)
3. జింజర్ (2)
4. క్షీరం (2)
5. క్రింద నుంచి బియ్యపు అన్నం (4)
7. హోమంలో వేసే కర్ర (3)
8. పశుపక్షుల ఆహారం (2)
10. పిడప (4)
12. పెద్ద కేక (4)
13. క్రింద నుంచి క్రీస్తు (2)
16. కైతను సాగదీస్తే... (3)
19. శక్తి, సామర్థ్యం (2)
20. జీవాత్మ, లోపల నుండేవాడు (4)
21. బెజవాడ దేవత క్రింద నుంచి (2)
22. క్రింద నుంచి వాపు రోగం (2)
24. ఇంగ్లీషు దర్జీ తడబడ్డాడు (3)
26. వర్కు క్రింద నుంచి (2)
28. నాలుగు విధాలైన బలగాలు (4)
30. క్రింద నుంచి ముగ్గురు (2)
32. అన్నం గింజ (3)
33. దిగులు (3)
35. క్రింద నుంచి సంపాదన (3)
37. మర (2)

**సమాధానాలు**

## పదరంగం -52

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]అ | భి | [2]న | యం | | [3]ప | | [4]వ | లు | [5]వి | |
| వ | | వ | | [6]అ | వ | కా | శం | | [7]శా | ఖ |
| [8]శే | ష | త | [9]ల్పం | | నం | | | [10]జ | లం | |
| షం | | [11]రం | శి | | | | [12]ద | గ | | [13]ప |
| | [14]హ | | | [15]రా | [16]త్రి | | [17]ఎ | త్తు | [18]గ | డ |
| [19]బి | డా | రు | | [20]ణి | వే | | | | [21]రి | క |
| [22]లా | వు | | [23]ప | | [24]ణి | ప | [25]వి | | క | |
| [26]గు | డి | | [27]ని | వా | సం | | [28]వా | క్కు | | [29]ప |
| | | [30]పు | వా | | గ | | దం | | [31]బ | రి |
| [32]చె | లి | కా | డు | | [33]మ | [34]తే | | [35]కొ | లి | మి |
| ర | | రు | | [36]పా | ము | లు | | [37]స | మి | తి |

# సంక్షిప్త సింహపురి

## సమాచార చట్టంపై అవగాహన అవసరం!

సమాచారహక్కు చట్టం అమలులో జర్నలిస్టులు తనవంతు సహకారం అందించాలని రాష్ట్ర సమాచార హక్కు చట్టం కమిషనర్ పి.విజయబాబు సూచించారు. ది జర్నలిస్ట్స్ యూనియన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ నెల్లూరు శాఖ నిర్వాహకులు ఇటీవల ఆయన్ను హైదరాబాద్‌లో కలిశారు. ఈ సందర్భంగా విజయబాబు మాట్లాడుతూ అధికారులు, వివిధశాఖల్లో పని చేసే సిబ్బంది, సామాన్య ప్రజానీకానికి సమాచార హక్కు చట్టం గూర్చి ఇంకా తెలియాల్సిన అవసరం ఉందన్నారు. మార్చి 28వతేది సమాచారహక్కు చట్టంపై నెల్లూరులో ఏర్పాటు చేసే సదస్సుకు హాజరవుతానన్నారు. కమిషనర్‌ను కలసిన వారిలో వి.వీరాంజనేయులు, జి.నాగరాజారావు, చెరుకూరు రామకృష్ణారావు, మస్తానయ్య, గురవారెడ్డి తదితరులున్నారు.

## వికలాంగులకు వీల్‌ఛైర్స్ పంపిణీ!



ఏ.సి సుబ్బారెడ్డి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం ఇటీవల జరిగింది. ఈ సందర్భంగా ఐదుగురు వికలాంగులకు వీల్‌ఛైర్స్ పంపిణీ చేశారు. ఈ కార్యక్రమానికి రూరల్ డిఎస్పీ కె.బాలవెంకటేశ్వరరావు ముఖ్యఅతిధిగా విచ్చేసి అసోసియేషన్ చేస్తున్న సంఘసేవను ప్రశంసించారు. నడక, వ్యాయామం గూర్చి పలు సూచనలు చేశారు. ఈ కార్యక్రమంలో అసోసియేషన్ అధ్యక్షులు ఎస్.రాఘవేంద్ర షెట్టి, కార్యదర్శి ఎన్.బలరామయ్య నాయుడు, కోశాధికారి ఎస్.రమేష్, ఉపాధ్యక్షులు వి.నారాయణరావు, కె.విజయభాస్కర్‌రెడ్డి పలువురు కమిటీ సభ్యులు పాల్గొన్నారు.

## పూజా పునస్కారాల్లో డిజిపి!

రాష్ట్ర డిజిపి దినేష్‌రెడ్డి మూడు రోజులపాటు హల్‌చల్ నెల్లూరులో చేశారు. నెల్లూరు వచ్చినపుడు జొన్నవాడ కామక్షమ్మను, రాజరాజేశ్వరమ్మను ఆర్చించడం ఆయనకు అలవాటు. ఈసారి సండేమార్కెట్ వంటి ఇరుకు ప్రాంతంలోని సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానంలో కూడా ప్రత్యేక పూజలు చేశారాయన. మాగుంట శ్రీనివాసులురెడ్డి ఇంట్లో బస చేసిన ఆయన తన అత్తవారిల్లు మైపాడుకు వెళ్లి మామ బలరామిరెడ్డితో కాసేపు గడిపివచ్చారు. తన వ్యక్తిగత పర్యటనలో సైతం నెల్లూరు మీడియా చొరబడడంపై దినేష్‌రెడ్డి రుసరుసలాడారు. అయినా ఆయన రహస్య పర్యటన చేయక బహిరంగ పర్యటన చేస్తూ మీడియాను వెంటపడవద్దంటే ఊరుకొనే రోజులా ఇవి. నెల్లూరులో పోలీసుల పనితీరు బాగుందని డిజిపి చెప్పడం జనం మెచ్చలేదు. ఈ విషయం ఆయనకెవరు చెప్తారు.

## ముసవ్విర్‌కు సన్మానం



నెల్లూరు జెండావీధి వాసి సూక్ష్మ కళాఖండాల సృష్టికర్త ముసవ్విర్‌ను లయన్స్‌క్లబ్ ఆఫ్ నెల్లూరు ప్రగతి నేతృత్వంలో ఘనంగా సన్మానించారు. ఈ సందర్భంగా లయన్స్ గవర్నర్ డాక్టర్ జి.బాల మద్దయ్య మాట్లాడుతూ మునవ్విర్ తయారు చేసిన సూక్ష్మ కళాఖండాలను చూసి అబ్బుర పడ్డానన్నారు. ముసవ్విర్‌ను ప్రభుత్వం అన్ని విధాలుగా ప్రోత్సహించాల్సిన అవసరం ఉందన్నారు. ఈ కార్యక్రమంలో లయన్స్ జిల్లా క్యాబినెట్ సెక్రటరీ జి.అప్పారావు, మల్టిప్లై ట్రెజరర్ లయన్ డిఎస్ కుమార్, పాస్ట్ గవర్నర్ లయన్ డాక్టర్ వి.మధుసూధన శాస్త్రి, పాస్ట్ జిల్లా గవర్నర్ డాక్టర్ కెఎస్‌జి హెచ్చార్, బి.వి.రమణ గౌడ్, నిజాముద్దీన్, ఖలీద్ తదితరులు పాల్గొన్నారు.

## జలగలా పట్టి పీడిస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వం!



రాష్ట్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం కరెంట్ చార్జీల దోపిడీకి నిరసనగా వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ యువజన విభాగం గాంధీ బొమ్మ వద్ద ప్రజాభిప్రాయంలో భాగంగా సంతకాల సేకరణ కార్యక్రమం నిర్వహించింది. డాక్టర్ అనిల్‌కుమార్, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి నేతృత్వంలో ఈ కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా అనిల్‌కుమార్ యాదవ్ మాట్లాడుతూ దివంగత మహానేత డాక్టర్ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఒక్క రూపాయి కూడా కరెంట్ ఛార్జీలు, ఇంటిపన్ను పెంచకుండా కరెంటు కోతలు లేని ప్రజాసంక్షేమ రాజ్యం నడిపిన విషయాన్ని గుర్తు చేశారు. ఇప్పటి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం ప్రజాసంక్షేమాన్ని గాలికి వదిలేసి ప్రజాకంటక పాలనలో ప్రజల జీవితాలతో ఆడుకొంటుందన్నారు. కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ పెంచిన కరెంట్ ఛార్జీలకు వ్యతిరేకంగా ఉద్యమ స్ఫూర్తితో ఉద్యమాలు నిర్వహిస్తామన్నారు. ఈ కార్యక్రమంలో ముక్కాల ద్వారకానాథ్, కె.వి.రాఘవరెడ్డి, తాటి వెంకటేశ్వర్లు, సంక్రాంతి కళ్యాణ్, పడవల సుధాకర్ తదితరులు పాల్గొన్నారు.



## రైతు లోకం – మామిడి తోటల్లో తీసుకోవలసిన జాగ్రత్తలు!

మన జిల్లాలో ప్రస్తుతం మామిడి తోటలు పూత దశలో వున్నాయి. ఈ క్రింద తెలిపిన పద్ధతులు పాటించి మంచి, నాణ్యమైన దిగుబడులు సాధించవచ్చు.

మామిడిలో బోరాన్ లోపం వున్న తోటల్లో పూత బాగా వచ్చినప్పటికీ ఫలదీకరణ సరిగా జరగకపోవటం వల్ల పిందె కట్టు సరిగా వుండదు. దీనికిగాను పూ మొగ్గలు బయటకు రాకముందు బోరాక్స్ పౌడర్ లేదా బోరాన్-19 2గ్రాములు లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

కొత్త చిగురు వచ్చేటప్పుడు మరియు పూ మొగ్గలు పెరుగుదల దశలో వున్నప్పుడు 1.5 – 2 గ్రాముల జింక్ సల్ఫేట్ మరియు 1.25 గ్రాముల బోరాన్ లీటరు నీటికి కలిపి చెట్లు బాగా తడిచేటట్లు పిచికారీ చేయాలి.

తేనె మంచు మరియు తామర పురుగుల నివారణకు మామిడి చెట్టు పూ మొగ్గ దశలో వున్నప్పుడు 0.3 మిల్లీలీటర్లు ఇమిడాక్లోప్రిడ్ లేదా 1.5 గ్రాముల అసిఫేట్ మరియు 1 మిల్లీలీటర్లు డైఫెనోకొనజోల్ లేదా 2.5 గ్రాముల మాంకోజెబ్ లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

పచ్చి పూత దశలో రసం పీల్చు పురుగుల నివారణకుగాను థయోమిథాక్సామ్ 0.3 గ్రాములు లేదా మిథైల్‌డెమటాన్ 2 మిల్లీలీటర్లు మరియు బూడిద తెగుళ్ల నివారణకుగాను నీటిలో కరిగే గంధకం 3 గ్రాములు లేదా హెక్సాకొనజోల్ 2 మిల్లీలీటర్లు లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

గత సంవత్సరంలో కాయ తొలుచు పురుగు ఉధృతి ఎక్కువగా వున్న తోటల్లో జనవరి మాసం 2వ పక్షంలో (ప్రస్తుతం) పురుగు మందులైన క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లేదా కార్బరిల్ 3 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14



# దశమ వర్ధంతి



స్వయం కృషితో అభివృద్ధిలోకి వచ్చి ఎల్ల వేళలా మా అభివృద్ధిని కాంక్షించి
మమ్ము తన గుండెలలో దాచుకున్న ప్రేమ మయుడు, మా ఇంటి ఇలవేల్పు



జననం
2-12-1931





మరణం
5-2-2003

# శ్రీ గూడూరు భాస్కరరామిరెడ్డి గారు

(మాజీ మున్సిపల్ కౌన్సిలర్, నెల్లూరు)

మీరు మా మధ్యలేరన్న నిజాన్ని నమ్మలేకున్నాం.
మీరు భువిలో వున్నా, దివిలో వున్నా మీ ఆశీస్సులే మాకు శ్రీరామరక్ష.

**భార్య :** గూడూరు రత్నమ్మ

**కుమారులు - కోడళ్లు :** గూడూరు మాధవరెడ్డి – అనిత
గూడూరు మహేష్‌రెడ్డి M.Tech., M.S., (U.S.A) – శ్రీదేవి B.Tech., (U.S.A)

**కుమార్తె :** ఎస్.మైథిలి

**మనుమలు - మనుమరాండ్రు :** శివరూపేష్ (U.S.A), లక్ష్మీలాస్య, సాయిమనితేజ, అక్షిత్ (U.S.A), బావిక్ (U.S.A)

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com